# పీఠిక.

అపూర్వకథారచనాయోగంబునం బ్రసిద్ధి గాంచినసర్పపురమాహాత్మ్యంబు నచ్చ తెనుంగుంగబ్బములలో నెక్కుడై వన్నెకెక్కిననీలాసుందరీపరిణయంబును శ్రీమత్కూచిమంచితిమ్మకవిప్రణీతములు. ఈతిమ్మయ లోకంబున నభినవవాగనుశాసనుఁ డనియుఁ గవిసార్వభౌముఁ డనియు బిరుదులఁ గాంచినమహాకవి.

ఇతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. బయ్యనామాత్యుని మునిమనుమఁడు. ఇతనిపితామహుఁడు తిమ్మయ. తండ్రి గంగనామాత్యుఁడు, తల్లి లక్ష్మమ, జగ్గన సింగన నరసనయు నితని పెదతండ్రులు, వీరమ పాపమయును మేనత్తలు. రాజనయు జగ్గనయు సూరనయు సహోదరులు, తిమ్మనయు సింగనయుఁ బెదతండ్రికొడుకులు, భార్య బుచ్చమ. ఈతనినివాసస్థలము గోదావరీమండలమందలి * పీఠికాపురసంస్థానము లోనికందరాడ యనుగ్రామ మనియు నితఁ డాయూరికరణ మనియుఁ దెలియవచ్చెడిని. ఇతఁడు పుట్టి పెరిఁగినతావు చంద్రమపాలెము.

ఇతఁడు దెందులూరిలింగనారాధ్యదేశికేంద్రదత్తమాహేశ్వరాచార్యవృత్తికుఁడైనను కేవలశైవుఁడు గాక యద్వైతమతమే యవలంబించినట్లు నితనిగ్రంథములవలనఁ దెలియ వచ్చుచున్నది. కావుననే భావనారాయణస్వామి తిమ్మకవికి స్వప్నమునందు సాక్షాత్కరించి.

> “శివునకు నాకును భేదము యవమాత్రము లేదు. ... ... ... ...
> కృతులు శంభునికిడినసత్కీర్తి పేర్వ ప్రతిభ మెఱయంగ నెక్కుసత్కృతి నొకర్చి
> మాకు నర్పణసేయుము,”

మని కోరఁగా గ్రంథమును రచించి యాదేవునకు సమర్పించినట్లు యీసర్పపురమాహాత్మ్యములోఁ దెల్పఁబడియున్నది.

ఈకవి పీఠికాపురసంస్థానమునకుఁ బ్రభువైనరావుమాధవునికాలములో నుండి కృతులు వ్రాసి కవిసార్వభౌముఁడు లోనుగా బిరుదులం బడసియున్నట్లు తెలియుచున్నది. ఈతనిరెండవకృతి యగురుక్మిణీపరిణయము హూణశకము 1715 వసంవత్సరమున రచియింపఁ బడియుండుటచేతను నీతనికడపటికృతి యగుశివలీలావిలాసము హూణశకము 1756 వ సంవత్సరమందుఁ జేయఁబడియుండుటచేతను నీతిమ్మకవి హూణశకము పదునెనిమిదవ శతాబ్దారంభమునకుఁ గొంచెముపూర్వము జనించి తచ్ఛతాబ్దమధ్యముదాఁక జీవించియుండి నట్టు గనఁబడుచున్నది.

---

పీఠికాపురమునకె పీఠీపురమనియుఁ బీఠపుర మనియు నామాంతరములు. దీని కిప్పుడు పిఠాపుర మని ప్రసిద్ధి.

ఈకవి రచించినగ్రంథములలో నిప్పుడు ప్రసిద్ధములై యుండునవి యేవనఁగా.

1. రాజశేఖరవిలాస మను నామాంతరము గలభల్లాణచరిత్రము.
2. శాలి. శ. 1715 వ సంవత్సరమున రచియింపఁబడినరుక్మిణీపరిణయము.
3. సింహాచలమాహాత్మ్యము.
4. నీలాసుందరీపరిణయము.
5. అచ్చతెనుఁగురామాయణము.
6. సారంగధరచరిత్రము.
7. సాగరసంగమమాహాత్మ్యము.
8. శాలి. శ. 1740 వ సంవత్సరమున వ్రాయఁబడినలక్షణసారసంగ్రహము.
9. బ్రహ్మాండపురాణోక్త మగుగోదావరీఖండమందలివృద్ధశ్రవంతీసరిత్సతిసంగమమాహాత్మ్యము ననుసరించి శాలి. శ. 1760 సంవత్సరమందుఁ దెలుఁగుగా వ్రాయఁబడిన రసికజనమనోభిరామము.
10. శాలి. శ. 1754 వ సంవత్సరమున రచియింపఁబడినసర్పపురమాహాత్మ్యము.
11. శాలి. శ. 1756 సంవత్సరమందు వ్రాయఁబడినశివలీలావిలాసము.

ఈగ్రంథములే గాక యనేకశతకదండకసత్కృతు లీకవిరచియించినట్లు కన్పట్టుచున్నది.

ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసమును వ్రాసినగణపవరపువేంకటకవి కేవల మిన్నియాంధ్రగ్రంథములు వ్రాసి కీర్తిగన్నవాఁ డితఁ డొక్కరుఁడే. శివలీలావిలాసముకడపటఁ గవి తా నాప్రబంధమును ముప్పదియొక్కదినములలో రచించినట్లు వ్రాసియుండుటం జూడఁగా నీతనికవితాధోరణి యనర్గళప్రవాహమువంటి దని చెప్పవచ్చును.

ఈతనికవిత్వము ప్రాయికంబుగ శబ్దసౌష్ఠవముగల దై మే లైనశయ్యతోఁగూడి చదువునపుడు చెవులకిం పై యుండును. కావుననే యీతనిచుట్టం బైన యేనుఁగులక్ష్మణకవి యొకప్పు డీతనికవిత్వంబును శ్లాఘించి తనసమీపమున నున్నపండితులం జూచి

"పాటకగర్భవధూటీ లాటనచలితాంఘ్రినూపు రారావశ్రీ
పాటచ్చరములు లేనియ లేటలు మాకూచిమంచితిమ్మయమాటల్"

అని చెప్పినట్లు ప్రసిద్ధి కలదు. ఇతనివంశమునఁ బుట్టినవారికెల్లఁ గవిత్వరచనాసామర్థ్యం బొక్కింతయేని నలవడియుండక పోదు.

ఏతత్కవికృతంబు లైనగ్రంథములలో సర్పపురమాహాత్మ్య మింతదాఁక ముద్రింపఁబడకయుండుటచేతను నయ్యది చిత్రకథాసముజ్జ్వలం బగుటచేతను, నిప్పుడు పండితసాహాయ్యముచే నచ్చొత్తించితిమి, నీలాసుందరీపరిణయం బచ్చతెనుఁగుగబ్బ మగుటచేతను నిందాఁక నచ్చొత్తించియుండుగ్రంథమునందుఁ బెక్కులు తప్పిదములు గానంబడుచుండుట చేతను నాగ్రంథమునుగూడ ముద్రింపించితిమి,

# సర్పపురమాహాత్మ్య విషయసూచిక.

## ప్రథమాశ్వాసము.



## ద్వితీయాశ్వాసము.

# సర్పపురమాహాత్మ్యవిషయసూచిక.

**విషయము.** | **పుటసంఖ్య**



## తృతీయాశ్వాసము.





## నీలాసుందరీపరిణయ విషయసూచిక.

---

### ప్రథమాశ్వాసము.



### ద్వితీయాశ్వాసము.

## నీలాసుందరీపరిణయ విషయసూచిక.



### తృతీయాశ్వాసము.





శ్రీశారదాంబాయై నమః.

# సర్పపురమాహాత్మ్యము.

## ప్రథమాశ్వాసము.



యుతు నీశయుక్ ధరయుఁ • జేరి భజింప నిలింపులింపుగాఁ
బాయక సామగానరుచిఁ • బ్రస్తుతిసేయు సుపర్వలోకు ల
త్యాయతభక్తిఁ గొల్వ నన • పాయసుఖోన్నతిఁ బొల్చునారా
రాయణదేవుఁ డిచ్చు నధి • కైకసుఖంబులు భక్తకోటికిన్.

## ఇష్టదేవతాది ప్రార్థనము.

సీ. సనకాదిమునిమనో• బ్జముల తేటపట్టులు, హరియురస్స్థలము విం• హాసనంబు
సకలబృందారక • సతు లాడికవుఁ జెలుల్, పాలపారావారము • పుట్టినిల్లు
నలువమొగంబుల వేల్పు • కులపెద్ద తోఁబుట్టి, జగతీపతీమణి • సవతియన్న
కలువలచెలి కాఁడు • గాదిలిసైదోడు, బ్రహ్మాండములు రంగ • భవనములును
తే. గాఁగ వేదాంతవీథులఁ • గలసి మెలఁగు, నఖిలలోకైకజనయిత్రి • యాదిదేవి
యిందిరానందరాంగి మ • న్మందిరమున, వెలఁగి నిత్యంబు నృత్తంబు • సేయుఁగాక. 2

ఉ. శ్రీనగజాఘనస్తనవి • నృత్యసంకుమదైణనాభితం
కానిశవాసితస్ఫుటభు • జాంతరుఁ డిందుసుధాపయస్స్పద
గ్భానుతకీర్తి పీఠపుర • కుక్కుటలింగమహాప్రభుం డశే
షానతభక్తపాలన ప • రాయణుఁ డీవుత మాకభీష్టముల్.

క. మగనినగమేన వెలకాని, మగురంబల ముందు నాది • మూలం బగుమూ
జగమేలు సర్వమంగళ, జగమే లిడుఁగాక మాకు • సమ్యక్కరుణన్.

ఉ. పాయక కల్పకద్రువన • పాళుల కన్నతి నుండి దేవతా
నాయకముఖ్యులన్ మునిజ • నప్రవరుల్ గొలువన్ జగంబుల
న్యాయతశీల నేలు నతఁ • డానతుఁ డాదరశక్తిబుద్ధి దీ
ర్ఘాయురభీప్సితార్థము ల • నారత మాకు నొసంగుఁ గావుతన్. 5

శా. వాణీద్వంద్వము మోడ్చి మ్రొక్కెదుదు నం • భద్వంభరీవేణికిన్
మాణిక్యాంగదమేఖలావలయున • మ్యగ్గ్వాభరణశ్రేణికిన్
వీణాపుస్తకపాణికిన్ సుగుణికిన్ • శ్రీదత్త్వవిన్నత్రోణికిన్
క్షోణీనాథకటాక్షగర్భితమహా • గీర్వాణికిన్ వాణికిన్. 6

చ. కరములఁ దోయిలించి నుతు • లంబున నిమ్ములఁ బ్రస్తుతింతు భా
స్వరగుణవంతునిన్ సకల • సత్కవిజాలవనీవసంతునిం
జిరకరుణానిశాంతుని వి • శిష్టజనావనసుప్రశాంతునిన్
సురతరుమంజరీవిభవు • శోభితవంగుని నేకదంతునిన్. 7

చ. ముదమునఁ గేలుఁదామరలు • మోడ్చి నమస్కృతు లాచరింతు బ
ల్లిదుఁ దగు దొంగుబాహకుల • లింగయసద్గుణనాగనాళికిన్
వనములఁ గోకిలం బ్రియర • సంపదపాపవర్గవుహోళి కు
న్నదవరవాదిమందిలత • మన్నముదాయుమయూఖమాలికిన్. 8

సీ. గురుతరకౌండిన్య • గోత్రవిఖ్యాతుండు, బయ్యనామాత్యుఁ డే • ప్రోభునితాత
విరతాన్నదానద • క్షితయశస్సాంద్రుండు, తిమ్మనసచివుఁ డే • ధీరుతండ్రి
ఘనులు జగ్గనయుఁ బిం • గనమంత్రియును వర, సన్నయు నేనన్వ • యనుజవరులు
తిమ్మయాఖ్యుఁడు నేఁ బ్ర • సిద్ధులు పింగనయు జగ్గనయు సూరనయు నే • యనఘుసూను
తే. లతులమతి రాజమాంబ యే • సుధిప్రజనని, యతిపతివ్రత లక్ష్మి యే • చతురరాణి
యట్టి శ్రీకూచిమంచివం • శాబ్ధిచంద్రు, మజ్జనకు గంగనామాత్యు • మదిఁ దలంతు. 9

తే. వ్యాస వల్మీకభవ కాళి • దాస మాఘు, చోర భారవి బాణ మ • యూర భోజ
దండి భవభూతి ముఖ్యాది • సత్కవీంద్ర, శేఖరుల నెంతుఁ గావ్యసం • సిద్ధికొఱకు. 10

ఉ. నామది నెప్పుడుం దలఁతు • నన్నయఁ దిక్కన నెఱ్ఱప్రెగ్గడన్
భీమకవీంద్రు భాస్కరుని • వీరకవీంద్రుని రంగనాథునిన్
సోముని బోతనార్యుని • సుప్రవరు ల్బహుళాంధ్రకావ్యముల్
నేమ మెలర్పఁ జెప్పి యవ • ని న్నుతి గన్నమహానుభావులన్ 11

సీ. మునినాథ విస్మయం♦ బుగ మీర లిందు వేం, చేయుటకతన నే♦ జేసినట్టి
తపము సిద్ధించె నేం♦ తయుఁ గృతార్థుఁడ నైతి, నరగ నాజన్మంబు♦ సఫల మయ్యె
మీ పదస్పర్శచే♦ కోటిపుణ్యంబుల, నాకరం బయ్యె మ♦ దాశ్రమంబు
భవదీయదివ్యాకృ♦ తానిరీక్షణమున, నిఁక నాకు దుర్లభం♦ బెద్ది కలదు
తే. చేయు నీయాజ్ఞ దలమోచి♦ విధ్య నిచ్చ, మెలఁగువాఁడ నటంచు న♦ర్మిలి వచించు
శౌనకునిఁ జూచి యక్కుంభ♦ సంభవుండు, పలికె నిట్లని సాంత్వన♦భాషణముల.

క. వినుఁడు శౌనకమునికోరికచే, మునివర నే వచ్చినాఁడ♦ ముదమున నిటకున్
వినుము మింతటికన్నఁ బ్రియో, జన మేమియు లేదు నాకుఁ♦ జర్చింపంగన్. 40

క. హరిసందర్శనమున శ్రీ, హరిభక్తులదర్శనంబు♦ నత్యులకు ఫలం
బరయఁగ శ్రీరంగంబులకుం, బరువడిఁ దత్కథలు వినుట♦ ఫలము మునీంద్రా. 41

సీ. మత్సరు లెల్ల ని♦ర్మత్సరు లగుదురు, రాగాన్వితులు వీత♦రాగు లగుదు
రజ్ఞు లెల్లను జ్ఞాను♦ లగుదురు నిస్స్పృహు, లగుదు రెంతయు స్పృహా♦యుతు లెల్ల
మహనీయభవదాశ్రి♦ మస్థలసంపర్క, మున నని విశ్రుతం♦ బుగ ధరిత్రి
జెప్పంగఁ బడుటచే♦ నే నిది గనుఁగొన, నరుగుదెంచితిఁ దథ్య♦మయ్యె నేఁడు
తే. తాపసోత్తమ నీమహా♦త్మ్యంబు దలఁప, నరిది యని పల్కుటయు వేడ్క♦నలరి కుంభ
సంభవునిఁ జూచి వేఁడి యా♦శౌనకుండు, మృదుమధురవాక్ప్రవీణత♦ మెఱయఁ బలికె.

తే. యతికులోత్తంస వినుము త♦త్త్వావబోధ, శీలుఁడవు నీవు నేఁడు వేం♦చేసి యిందు
వడుగుపెట్టినకతన మీ♦ వమర నినిన, యస్లు కాఁగల దిఁక సంశ♦యంబు లేదు. 43

వ. అనిన నగస్త్యుం డిట్లనియె. 44

తే. సర్వలోకేశ్వరేశుఁడు♦ సర్వకర్త, యఖిల కల్యాణసాగరుఁ♦ డమలమూర్తి
యాదినారాయణుం డాత్మ♦ నతనిఁ దలఁచు, జనుఁ డశేషమహాకిల్బి♦షములఁ బాయు.

సీ. కన్నులు భవదంఘ్రి♦కమలదర్శనమున, మృదుకరస్పర్శఁ ద్వ♦గింద్రియంబుఁ
ద్వత్పదాంబుజసంగం♦ధమున ఘ్రాణేంద్రియం, బును గడు సంతుష్టిఁ♦ బొందె నింకఁ
జెవులు మీవాక్యవై♦భవము వినంగను, రసన మీవాక్సుధా♦రసముఁ గ్రోల
నభిలషించుచు నున్న♦ దనఘాత్మ సర్వేంద్రి, యసుఖావహం బయ్యె♦ నఖిలశుభఫ
తే. లములు సొనగూడె భవదాగ♦మమున మాకు, ననుచు నత్యంతవినయజ్ఞుఁ♦ డగుచు నాడి
కలశభవుఁ దద్ద సంప్రీతుఁ♦ గా నొనర్చి, రొలసి దైవాఱఁ గ్రమ్మఱ♦ నిట్టు లనిరి. 46

ర్దమునఁ బ్రతిష్ఠ చేసె విధి ♦ తంబుగ నచ్చటఁ గల్గియున్న పా
వనసరసీత్రయంబు భువ ♦ నైభవ మెట్టి దెఱుంగఁ జెప్పవే. 55

## శేషుఁడు తపం బొనర్చుట.

క. అన నంబుజభవుఁ డిట్లను, ముని కశ్యపుఁ డనెడు పరమ ♦ మునికిం గద్రూ
వనితకుఁ బుట్టినవేవురు, తనయులఁ బటుసర్పరూప ♦ ధరు లబ్రముగన్. 56

తే. వారిపైఁ దల్లి కొండొక ♦ కారణమునఁ, నలిగి శపియింప నందఱు ♦ నగ్నితప్తు
లై కృశించుచు నున్నచో ♦ నం దనంతుఁ, డనెడు భుజగేంద్రుఁ డొకఁ డుర ♦ యుంబ వెడలి.

క. ధరఁ గల పుణ్యస్థలములు, దిరిగి తిరిగి మరలి యుదధి ♦ తీరంబున శ్రీ
హరి నచ్యుతు నభవు రమే, శ్వరుఁ గూర్చి మహోగ్రతపము ♦ నలుపఁ దొడంగెన్. 58

తే. కుముదకహ్లారకువలయ ♦ విమలకమల, సారసౌరభసహితకా ♦ సారతీర
మున ననేకాబ్దములు నిష్ఠ ♦ పూని ఘోర, తపము గావించె దివిజబృం ♦ దములు పొగడ. 59

శా. అత్యుగ్రతపస్సమాధి నటు ని ♦ ద్రాహారముల్ మాని య
బ్జాక్షశ్రీపదపంకజాతయుగళ ♦ ధ్యానావగాఢాత్ముఁడై
దీక్షం గ్రాలుచు నున్నచో హరి రమా ♦ ధీశుండు విష్ణుండు సా
క్షాత్కారముఁ బొందె నభ్రమున నా ♦ నక్తుశ్రీవస్వామికిన్. 60

సీ. శంఖచక్రగదాసి ♦ శార్ఙ్గాయుధములతోఁ, దివ్యజాంబూనదాం ♦ బరముతోడ
వనమాలికావృత ♦ వక్షస్స్థలంబుతోఁ, గౌస్తుభశ్రీవత్స ♦ కములతోడఁ
బద్మరాగాశ్మకం ♦ భత్కిరీటంబుతో, నవరత్నమయభూష ♦ ణములతోడ
సురుచిరహరినీల ♦ శోభితాంగంబుతో, నండజాధీశవా ♦ హనముతోడ

తే. నెలమిఁ బ్రత్యక్షమై మ్రోల ♦ నిలిచియున్న, యాదినారాయణునిఁ బర ♦ మాత్ముఁ గాంచి
యలర దండప్రణామంబు ♦ లాచరించి, యురగకులభర్త దల వాంచి ♦ యూరకుండె. 61

తే. అపుడు కరుణాపయోనిధి ♦ యైనశౌరి, వానిఁ గన్గొని యిట్లను ♦ వత్స యిచట
నిట్టిదుష్కరతరతపం ♦ బేల చేసె, దెవ్వఁడవు నీవు నీకోర్కి ♦ యెద్ది చెపుమ. 62

క. ఉరగా నీతపమునకుం, బరితోషము నొంది యేను ♦ బరువడి నీకున్
వర మీ వచ్చితి నడుగుము, కర మరుదుగ నెద్దియైనఁ ♦ గడపక యిత్తున్. 63

వరద నారాయణ చతుర్భుజ ♦ వాసుదేవ హరే జనార్దన
పరమపురుష పరేశ కేశవ ♦ పద్మనాభ రిపుప్రమర్దన
మధునిషూదన కృష్ణ కైటభ ♦ మథన విష్ణో గరుడకేతన
విధిముఖాభవజనక భవహర ♦ వేదవేద్య జగత్సనాతన
తరణిహిమకరనయన ధీర ♦ త్రసనిరస్తవిలసదిన్దిర
పరమపావన విశ్వమయ మాం ♦ పాహి శ్రీవైకుణ్ఠమన్దిర. 65

సీ. దీనబాంధవ కృపా ♦ నిధి భక్తవత్సల, రవికోటిధామ పు ♦ రాణపురుష
క్షీరాబ్ధిశయన ల ♦ క్ష్మీమనోవల్లభ, వైకుంఠనాయక ♦ వాసుదేవ
నిగమాంతసంవేద్య ♦ నిర్మలానంతక, ల్యాణగుణార్ణవ ♦ యాదిదేవ
జగదుద్భవస్థితి ♦ సంహారకారణ, భూతభావన మహా ♦ ద్భుతచరిత్ర
తే. పుండరీకాక్ష నీగుణం ♦ బులు గణింప, నజసహస్రాక్షులకు నైన ♦ నలవి గాదు
బాలిశుఁడ నైననేను నిన్ ♦ బ్రస్తుతింప, నెంతవాఁడను మునిజన ♦ స్వాంతభవన. 66

తే. వారిజాతాక్ష యిపుడు భ ♦ వత్కటాక్ష, వీక్షణంబున నఘములు ♦ వీడఁబాసె
క్షుత్పిపాసలు దీఱె నీ ♦ శుభదమృదుల, వాక్సుధారసపానంబు ♦ వలన నీశ. 67

క. నిను స్మరియించినఁ దలఁచినఁ, గనుఁగొన్నను వందనములు ♦ గావించిన న
ర్చన లొనఁగిన సజ్జనులకు, ఘనదురితములెల్లఁ బాయుఁ ♦ గద జగదీశా. 68

క. వనజభవ భవ సురేంద్రులు, సనకాదిసమస్తయోగి ♦ జనులును వేదాం
తనిగూఢార్థజ్ఞానులుఁ, గనలేనిత్వదంఘ్రియుగము ♦ గంటి నధీశా. 69

తే. అహహ జగముల నాభాగ్య ♦ మహిమ యెన్న, నరిది యిఁక నింతకంటె నే ♦ మైనఁగోర్కె
గలదె భవదంఘ్రియుగభక్తి ♦ గలుగ నిమ్ము, చిరతరానంద గోవింద ♦ శ్రీముకుంద.

## శేషుఁడు తనవృత్తాంతమును విష్ణువునకుఁ దెల్పుట.

తే. అయిన నెఱిఁగింతు నిపుడుమీ ♦ యాజ్ఞ వలన, నేఁదపము సేయుకార్యంబు ♦ నిక్కువముగ
ననఘ కశ్యపుఁ డనెడుమ ♦ హర్షివరుని, తనయుఁడ ననంతుఁ డనుపేరఁ ♦ దనరువాఁడ.

క. భ్రాతలు వేవురు నాకుఁ, మాతృక కద్రూవిసూటి ♦ మమ్మొకపనికై
యాతతవహనజ్వాలల, చేతం బడుఁ డంచు నలిగి ♦ సెపియించుటయున్. 72

క. పేరెన్నికగా నిందొక, కారణమునఁ బొడమి నిలువఁ • గలవాఁడఁట జామీ
నారదుఁ డనుమునివరున క, పారకృపారసనవృద్ధిఁ • బ్రత్యక్షం బై. 84

వ. అని నిఖిలగుణాకరయుండును భక్తపరతంత్రుండును భగవంతుండును నగు శ్రీహరి మృదు
మధురగంభీరోదారవచనంబుల భుజంగపుంగవు నారాధించి యంతర్ధానంబు నొందెఁ
బ్రతిదినంబు నీయుపాఖ్యానం బాకర్ణించుజనుండు జన్మబంధంబులం బాయునని చెప్పిన
విని శౌనకుం డగస్త్యునకు నెండియు నిట్లనియె. 85

## సర్పపురమండలివిష్ణుప్రతిష్ఠనుగుఱించి యగస్త్యుని శౌనకుం డడుగుట.

ఆ. యతికులేంద్రచంద్ర • యద్భుతంబుగ నీక, థాప్రసంగ మిపుడు • దవిలి వింటిఁ
గాని మదికిఁ దృప్తి • గలుగకున్నది యింక, వినఁగవలయుఁ దెలుపు • విస్తరముగ.

తే. కలశజన్మ యొకానొక • కారణమున, నిచట వసియింతు నని భుజ•గేంద్రుఁ బలికె
నాదిపూరుషుఁ డైనట్టి • హరి యటంచు, నాడితిరిగద మీ రిపు • డద్భుతముగ. 87

క. ఆకారణ మెట్టిది భువ, నైకధురంధరుఁడు విష్ణు • వీశుఁడు ధరణిన్
దాకొని నారదమునిచే, నేకరణిఁ బ్రతిష్ఠఁ బొందె • నెఱిఁగింపు దయన్. 88

## నారదుండు బ్రహ్మసభ కరుగుటనుగుఱించి యగస్త్యుండు దెల్పుట.

సీ. అనిన శౌనకున కి • ట్లనియె నగస్త్యుండు, సంయమీశ్వర ఫణి • స్వామితోడ
భగవంతుఁ డాడిన • పలుకు తథ్యంబుగ, శోభనలీల న • చ్చోటఁ బుడమి
నారదమునిచే జ • నార్దనుఁ డెలమిఁ బ్ర, తిష్ఠితుఁ డై యుండె • దివిజు లెన్న
నత్తెఱఁ గెఱిఁగింతు • నవధరింపుము సమా, హితమనస్కుఁడ వయి • వితతభక్తి

తే. సకలభువనంబులం దెల్ల • సంతతంబు, సంచరించుచు నుండును • జ్ఞాననిధియుఁ
బరమభాగవతాచార • నిరతుఁ డైన, నారదర్షివరుం డొక్క•నాఁడు వేడ్క. 89

సీ. కాషాయవసనరం • గత్కటీరముతోడ, రమ్యమృదూర్ధ్వపుం • డ్రంబుతోడఁ
బద్మాక్షమాలికా • ప్రతతవక్షముతోడ, నకుటిలదండకుం • డికలతోడఁ
గనకవిపంచికా • కలితహస్తముతోడఁ, బటుతరారుణజటా • పటలితోడ
శరదిందుచంద్రికా • సదృశగాత్రముతోడ, దంభారుకృష్ణాజి • నంబుతోడ,

తే. మాధవానంతగోవింద • మధునిషూద, నాచ్యుతజనార్దనోపేంద్ర • హరిశయాన
యనెడునన్నుతివాక్యములతోడ • నద్భుతముగఁ, దంద్రిదర్పించుకోరికఁ • దరలి చనియె.

వ. అయ్యవసరంబున. 91

సీ. బలరిపుప్రముఖది • క్పాలకు లోకమంక, నొకమంక సనకాది • యోగివరుల
గరుడకిన్నరయక్ష • గంధర్వ లోకమంక, నొకమంక సిద్ధుల • సాధ్యకుబేంద్రు
లర్కచంద్రాదిగ్రహ • మాధ్యుల లోకమంక, నొకమంకఁ గ్రమాత • పూర్తిమునులు
ఖచరవిద్యాధర • గోత్రముల లోకమంక, నొకమంక సమరుద్రి • పాలకపాలురు
తే. గ్రాలిన శశికోటిమార్తాండ • విలసదమల, మణిగణస్థానిశోస్థాన • మండపమున
రత్నపీఠాగ్రమున నరు • పాగ్రభవమున, వాణిఁ గొలువుండె నరసీరు • హాసనుండు. 92

వ. అట్లు గొలువున్న యన్నిలింపశ్రేష్ఠుం బొడగాంచి నమస్కరించి నారదుండు కరాబ్జ
ప్రకారంబున వర్ణానమును గూర్పండి యుట్లని వినుతించె. 93

సీ. జయ పితామహ సర్వ • జగదుద్భవవిధాన, జయ చతుర్ముఖ యోగి • జనశరణ్య
జయ భాగ్యసాగర • సకలలోకేశ్వర, జయ హంసవాహన • జలజగర్భ
జయ శతానంద ని • శ్చలగుణాలంకార, జయ సురజ్యేష్ఠ స • జ్జ్ఞానగమ్య
జయ విరించన వేద • శాస్త్రవిస్తరదక్ష, జయ సరోజాసన • సాధువంద్య
తే. జయ పురందరముఖసుధా • శనవితాన, ధగ్నకోటీరవిఘటిత • పద్మరాగ
మణిమయూఖావళీ రాజ • మానపార్శ్వ, దివ్యతరపాదరాజీవ • దేవదేవ. 94

వ. అని నుతించుచున్న సమయంబునం జతుర్ముఖుండు చతుర్వక్త్రంబులఁ బరమాద్భుతంబు
లైనవృత్తాంతంబులు సభాజనంబు లానందింపం జెప్పుచుండి యంతఁ బ్రసంగవశంబున
లక్ష్మీమనోనాథుం డైనవిష్ణునవంతవైభవంబు సమధికగంభీరనాదంబున నిట్లని చెప్పఁ
దొడంగె. 95

## నారాయణుని యుత్కృష్టత్వమును బ్రహ్మ వర్ణించుట.

తే. స్రష్టయును సృజ్యుఁడును దానె • జగములందు
రక్షకుఁడు రక్ష్యుఁడును దానె • ప్రత్యహంబు
హర్తృసంహార్యులును దానె • యతికృపాప
రాయణుం డైనయాదినా • రాయణుండు. 96

తే. అజుఁ డతండె జనార్దనుఁ • డతఁడె శంభుఁ
డతఁడె పురుహూతుఁ డతఁడె చం • ద్రార్కు లతఁడె

వహ్ని యాతండె సకలదే • వతలు నతఁడె
విశ్వ మంతయు నాతండె • వేఱులేదు. 97

క. నేనును బరమాత్ముఁడు నీ, వానుఁడు నిఖిలామరులును • సనకాదిమహా
మౌనులును విష్ణుమాయా, మానావర్తమున మునుఁగు • చుండుదుముగదా. 98

వ. మఱియు దేహప్రాణంబులు భిన్నంబు లయ్యు నేకప్రకారంబునం గనుపట్టు దేహంబులు
జడంబులు ననిత్యంబులు నవిశుద్ధంబులు నతివికారంబులు నై పంచభూతంబులచేత
సంఘటితంబు లగుచు నంతంబున వానియందె విలయంబును జెందు విరుద్ధధర్మసంక్ర
మణంబునఁ దాదాత్మ్యవర్ణనంబునం దనర్హంబు లై యుండుఁ బ్రాణంబులు చిదానం
దాత్మకంబులు నిత్యంబులు శుద్ధంబులు నిర్వికారంబులుఁ బరమాత్మైకధారకంబులు నై
యుండు దేహప్రాణంబులకు సంసర్గంబు గావించి భగవంతుం డైన నారాయణుండు
తాదాత్మ్యబుద్ధిం బుట్టించుఁ దద్దేహుల కన్నాదులు ధారకంబులు స్రక్చందనాదులు
భోగ్యంబు లై యుండు. 99

తే. అంబుజాతభవాండము • ధ్వస్తు లగుచ, తుర్విధప్రాణులును దెల్వి • దొఱఁగి మదన
జనకమాయామహావర్త • మున మునింగి, వెడల శక్తులు గాకుండ్రు • వేయునేల. 100

వ. ఆబ్రహ్మస్తంబపర్యంతంబు స్థావరజంగమాత్మకం బగుసకలజగంబుఁ బ్రకృతినిష్ఠితం బై
యుండుఁ బ్రకృతి లోకంబునకుం గారణంబు బలవత్తరంబుగ మాయాగుణత్రయాను
బద్ధులును గామమోహితులును నై సమస్తప్రాణులు నుత్కృష్టధర్మం బగుజ్ఞానవైరాగ్య
లక్షణం బెఱుఁగ నేరక చెడుదురు జ్ఞానబుద్ధు లగుసమస్తయోగులు నణిమాదినిహతు
లగుదురు బ్రహ్మనైష్ఠికు లగుయతు లహంకారావృతు లై చెడుదురు వేదశాస్త్రాధికారు
లగుద్విజులు విద్యాగర్వ ప్రతిగ్రహదోషంబుల నశింతురు మఱియుం గరితురగాందోళి
కాంబరాభరణమణిరమణీప్రముఖమహైశ్వర్యగర్వంబున నుర్వీపతులును బరాహిత
క్రియావిధానంబుల మంత్రవాదులును శాపరూపకోపాటోపంబున బ్రహ్మర్షులును నకృ
త్యపరిగ్రహంబున సోమయాజులును లోభంబున ధనికులును యాచ్ఞాదికంబుల దరిద్రు
లును నీశ్వరార్పితబుద్ధిరహితయాగాదిదానంబులఁ గుదాతలును బరవధూపరిగ్రహాది
వివిధదోషంబుల సమస్తజనులును నధర్మాచారనిరతు లగుచు వర్తించి నశించి స్వర్గయ
మాలయాదిలోకంబులం బ్రవేశించి తత్తత్పుణ్యపాపఫలంబు లనుభవించి క్రమ్మఱ
నవనిం బ్రవేశించి కృమికీటకమృగఖగాదిక పాపయోనులం బ్రభవించి మరల నశించి

క. అంభోధికన్యకాకుచ, కుంభద్వయగంధసార • కుంకుమపంకా
దంభామోదామోదిత, కుంభద్రోరంతరాళ • శుభగుణశీలా 110

సుగంధివృత్తము.

కాశ హార కాశహార • కౌముదీ పయస్సుధా
కాశనిమ్న గేందు తార • కా శతార తారనీ
కాశకీర్తిసుప్రకాశ • కామితార్థదాయకా
కేశవాచ్యుతాప్రమేయ • కృష్ణ లోకనాయకా. 111

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్య
ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్య
పుత్త్ర సకల సంస్కృతాంధ్రలక్షణకళా కౌశలాభిరామ
తిమ్మకవిసార్వభౌమప్రణీతం బైనసర్పపురక్షేత్ర
మాహాత్మ్యం బను పుణ్యచరిత్రంబునందుఁ
ప్రథమాశ్వాసము.

శ్రీశారదాంబాయై నమః.

# సర్పపురమాహాత్మ్యము.

## ద్వితీయాశ్వాసము.



లలనాభూలలనా
నీళామహిళానాథ • నిరుపమమేధా
శీలాకటాక్షవీక్షా
పాలితనతయోగ సర్ప • పత్తననాథా.

తే. అవధరింపు మగస్త్యసం • యమివరుండు
శౌనకున కిట్లనియె నట్లు • సకలదేశ
ములఁ జరించుచు నారద • మునివరేణ్యుఁ
డురుతరామోదహృదయుఁడై • యొక్కనాఁడు.

### నారదుండు సర్పపురము చేరుట.

చ. చని చని కాంచె సిద్ధసుర • చారణయక్షభుజంగకన్యకా
జనకుచకుంభసంభృతవి • శంకటకుంకుమకైణనాభిచం
దనఘనసారసౌరభని • తాంతసుగంధివహాభిరామముం
ధనకనకప్రకీర్ణమణి • ధామము సర్పపురీలలామముం.

సీ. వేదవేదాంతప్ర • వీణవిప్రకులంబు, పరమభాగవతాళి • భ్రాజితంబు
దీపితనవరత్న • గోపురప్రకరంబు, సరసపుణ్యాంగనా • సంవృతంబు
పల్లవఫలపుష్ప • బంధురోద్యానంబు, పావనానంతస • రోవరంబు
దివ్యదేవాగార • దేదీప్యమానంబు, ధర్మనిర్మితహర్మ్య • భాసురంబు
తే. భూరిగారుత్మతద్వార • తోరణంబు, గురుతరానర్ఘ్యమాణిక్య • కుట్టిమంబు
లాలితోదగ్రహరినీల • జాలకంబు, పుణ్యనిలయంబు శ్రీసర్ప • పురవరంబు.

వ. అప్పట్టణంబు ప్రవేశించి యం దొకరాత్రి వసియించి మఱునాఁడు ప్రభాతసమయంబున లేచి. 5

## నారదుం డొకకొలనియందు మునింగి స్త్రీయగుట.

క. బృందారకముని సంధ్యా, వందన మొనరింపఁ గోరి ◆ వరజలములకై
యిందందు వెదకుచుండెన్, మందానందమున నంత ◆ మహిమ దలిర్పన్. 6

తే. అతనిగర్వం బడంగింప ◆ నాత్మఁ దలఁచి, యచట నద్భుతచేష్టితుం ◆ డైనహరి మ
నోహరంబుగ నొక్కపె◆న్గొలను సరగఁ, గల్పితముచేసె నాశ్చర్య◆కరముగాఁగ.

వ. అది యమందపిచుమంద మందార కుంద చందన సాల రసాల హింతాల తమాల మాలతీ పనస ఘనసారకదళీ కదంబ జంబు జంబీర పున్నాగ నాగరంగాశ్వత్థామలక ప్రముఖానేకానోకహాకీర్ణతట తలవనాంతరాళ సమగ్రవిపుల ఫలకిసలయాహారలీలా విహరమాణహరిహారీత కీర శారి పారావత పరభృత ప్రభృతివివిధ గరుద్రథరాజరాజి కూజిత భ్రాజితంబును, మందానిల సముద్ధూత వీచికాబిందు సందోహ సమాకీర్ణంబును, ప్రఫుల్లహల్లకేందీవరకుముద కువలయ విమలకమలాస్తోక మరందపానానందితేందిందిర బృందమందమధుర ఝంకారనినాద మేదురంబును, హంసకారండవక్రౌంచ బకచక్రవాకాదిశోజ్జ్వల విహంగరాజివిరాజితంబును, ప్రసూనరేణు సంపర్కారుణాంభఃపూరసుశీతలంబును, నిరంతర దివ్యసుగంధబంధురంబును, మత్స్యకచ్ఛపశిలీ ధుళీకుళీరముఖాశేషాంభశ్చరకుల సంకులంబును, బాంధవలోకశ్రమాపనోదక విమలోదక పరిపూరితంబును, సకలజన మనోహరంబును నగుకాసారంబు గనుంగొని నారదుం డత్యంతాద్భుతస్వాంతుం డగుచుఁ దత్తీరంబున వీణాకమండలువులు పెట్టి జలావగాహనార్థం బక్కొలంకుసొచ్చి మునుంగుచుం దేలుచుఁ గొంతతడవు విహరించియంత.

సీ. కొదమతుమ్మెదదిమ్ము ◆ నదలించు పెన్నెఱుల్, కెందమ్మివిరుల నేల్ ◆ కేలుఁగవయు
జక్కవకవ నొల్లు ◆ సముల్లాడు చనుఁగుబ్బ, లలఁతిచీమలబారుఁ ◆ గలఁచు నారుఁ
బున్నమరేఱేని ◆ నెన్నుముద్దుమొగంబుఁ, బగడాల నలికించు ◆ తొగరుమోవి
కలువరేకులసౌరు ◆ గెలుచువాల్గన్నులుఁ, బొన్నక్రొన్ననఁ గేరు ◆ పొక్కిలియును

తే. జికిలిక్రొమ్మించుటద్దంబుఁ ◆ జిన్నవుచ్చు, తళుకుఁజెక్కులు మొల్లమొ◆గ్గలహొరంగుఁ
దెగడుపలువాల్పుఁ దిన్నెల◆నగు పిఱుఁదులుఁ, గలిగి యబ్రంపు చెలరాచ◆కలికి యయ్యె.

తే. ఏమి చెప్పుదు నహహ ల◆క్ష్మీశుమహిమ, దొడఁగి వాక్ప్రవ్య జగముల ◆ నెవ్వఁ డోపు
నబ్బురముగ నారదున కప్పు ◆ డాఁడురూపు, వచ్చె నద్దేవవిభుప్రభా ◆ వంబువలన.

తే. నలరె రఘువర భృగువర • నల దిలీప, సగర పురుకుత్స శిబి హరి • శ్చంద్ర నహుష
భరత శశిబిందు విభవుల • ప్రాభవుండు, నయవిదుండు నిఖండభూ • నాయకుండు. 17

తే. అస్మహీపతిమణి తండ్రి • యట్లు ప్రజలఁ, బ్రోదిసేయుచు నక్షత్రి • భోగలీలఁ
బీఠికాపట్టణంబు నం • ప్రీతితోడ, సేవ్యదైవాజ్ఞ నెమ్మది • నేలుచుండె. 18

సీ. దేవదేవుండు నం • తిమాధవస్వామి, దలఁగ కీపురమున • నిలిచియుండె
నిరజనాయకసంపత్తి • తిష్ఠితుండై కుక్కు, టేశ్వరుఁ డీపీఠ • నిరవుకొనియెఁ
బృహతిరాష్ట్రదశ • పీఠంబులకుఁ బెద్ద, పురుహూతికాంబ యీ • ప్రోల వెలసెఁ
బరమపావన మైన • పాదగయాక్షేత్ర, మీరాజధానియం • దేపుమీఱె
తే. పితృకాశీప్రయాగాద్య • శేషదివ్య, తీర్థరాజంబులన్ని ప్ర • తిష్ఠఁ గాంచె
జేవుపాపట్టణం బది • యెన్న నలరు, భువనసారంబు పీఠికా • పురవరంబు. 19

సీ. వివిధశాస్త్రపురాణ • వేదవేదాంతసం, విదులయి వెలసిన • విప్రవరులు
హయమతంగజశతాం • గారోహణక్రియా, ప్రౌఢి గాంచినమేటి • బాహుజులును
ధనధాన్యవిస్ఫూర్తి • దానవిద్యాఖ్యాన, పారీణులైనట్టి • యూరుజులును
శాఁడిపంటలచేత • భాగ్యసంపన్నులై, సుస్థితి నలరొందు • శూద్రజనులు
తే. మఱియుఁ గొదలేనికలుములఁ • గొఱలి వఱలు, నితరవర్ణజనంబులు • నతిశయముగఁ
గలిగి యొప్పొద్దు శుభలీలఁ • జెలఁగుచుండు, భూరివిభవంబు పీఠికా • పురవరంబు. 20

క. ఆనగరి కధీశ్వరుఁడై, పూనిక నిష్టోపభోగ • ములఁ దనియుచు ధా
త్రీనాథమణి నికుండుం, డానగరిపుకరణి శీవి • నలరుచు నుండెన్. 21

## శరద్వర్ణనము.

శా. అంతన్ భ్రాంతనరస్సముగ్రబిసపా • శాహారలీలాపరి
భ్రాంతానంతమరాళికానిచయము • క్రావ్యస్వనాకర్ణనా
క్రాంతాత్యంతకుతూహలోల్లసితభా • స్వచ్చాలిపాలీజన
స్వాంతం బై శరదాగమంబు దనరెన్ • సర్వంసహామండలిన్. 22

సీ. విమలపయోదావళుల్ • దములు మింటఁ జరించె, కలమమంజరులెల్లఁ • దలలు వంచెఁ
గొలఁకుల నలినముల్ • గలువలు వికసించె, మదమరాళంబుల • రొదలు మించె
వృషభముల్ ఱంకెలు • వేయుచు నెదిరించె, శైవలినీతతుల్ • సన్నగించెఁ
[illegible] • శికులు నాలించెఁ, జూపఁగఁ బ్రోవలఁ రోం • పులు నశించె

కొందఱు కొండ చిట్టెలను • గొందఱు పందుల సేదుపందులన్
కొంద ఱనుండరకోర్వజాలమిఁ • గూల్చిరి బంట్లు కడంక మీఱఁగన్. 28

క. ఉండేళ్లఁ గొండగొఱియలఁ, బందుల దుప్పులను లేడి • పదువుల నిర్గం
డెండఱపందులఁగ కుచి, బృందంబులు గూడి చంపెఁ • బెల్లదలంగన్. 29

క. సేనాధిపు లాకొందఱు, కానంబుల విడిచి రాజ • సింహుఁడు మెచ్చన్
నానావిహంగోత్కరముల, సేనఁగ బరిమార్చి యార్చి • చెలఁగిరి సెమ్మిన్. 30

## నికుందరాజు వనిం జనుచు సుదతిం గని వర్ణించుట.

సీ. అంతట మృగయావి • హారంబుఁ జాలించి, వసుధాతలేంద్రుండు • వలనుమీఱఁ
దత్తటామీకలో • ద్యత్పరిష్కారన, మున్నతమేరుశృం • గోపమంబు
వజ్రగోమేధిక • వైడూర్యమరకత, హరినీలపుష్యరా • గాబ్జరాగ
మౌక్తికప్రముఖాప్త • మణిగణసమలంకృ, తము నగుఘనతురం • గమము డిగ్గి
తే. సూర్యసమతేజులను మహా • శూరు లనిల, వేగులను దివ్యభూషణా • న్వితులునైన
వీరపురుషులతోఁ గూడి • విపినవీథి, సెలమి దైవాఱ నందందు • మెలఁగుచుండె. 31

సీ. హారీతశుకశారి • కారవాక్రాంతంబు, పరభృతకూజిత • భ్రాజితంబు
సరసగానకళాని • శభ్రమద్భ్రమరంబు, ప్రమదనృత్యన్మత్త • బర్హిణంబు
నికటసరోహంస • నిస్వనాకీర్ణంబు, సాంద్రపుష్పపరాగ • సంకులంబు
ఫలభారకుసుమస్త • బకలసద్భూజంబు, మృదులమరందఝ • రీపరీత
తే. మలితరామోదమేదురా • త్యంతశీత, లానిలకిశోరవారస • మాదృతంబు
నైనయక్కాననంబు భూ • జాని కపుడు, మోదమును గూర్చె గడితంపు • సేదదీర్చి. 32

వ. అట్లు సంభావనం బగువవ్వనంబున విహరించుచుం జని చని యొక్కచోట. 33

మ. కనియెన్ భూపకుమారమౌళి యొకతా • కాచంద్రబింబాననం
గనకాంగిం గలకంఠకంఠిఁ గలికిం • గస్తూరికాసౌరభం
గనదంభోజదళోపమాననయనన్ • గంధేభకుంభస్తనిన్
ఘనసారాచ్ఛదరస్మితన్ ఘనకచం • గాంతాజనగ్రామణిన్. 34

క. కని మెల్లన డాయం జని, వనజాయతనేత్రరూప • వైభవములకున్
మనమున నద్భుత మొందుచు, జననాయకమౌళి దాని • సౌరు నుతించెన్. 35

వ. అప్పు డమ్మహీతలవల్లభుండు దానికరంబు పట్టుకొని సుఖాసనంబునం గూర్చుండం జేసి యమందానందకందళితహృదయారవిందుం డగుచు వరూథినీపరివృతుం డై దివ్య తూర్యఘోషంబులు సెలంగ నిజపట్టణంబు ప్రవేశించి. 57

## నికుండుఁడు సుదతితో నిష్టోపభోగము లనుభవించుట.

తే. అంత నంతగిపురంబున ♦ కరిగి దివ్య
మందిరంబున నవ్వధూ ♦ మణిని నిలిపి
యిందుముఖిఁ గూడుకొన నెపు ♦ డెప్పు డంచు
సురతరామోదహృదయుఁ డై ♦ యుండె నంత. 58

సీ. తరణి పశ్చిమసము ♦ ద్రప్రాంతమునఁ గ్రుంకె, గడితంపుసాంధ్యరా ♦ గంబు పర్వెఁ
గటికిచీఁకటులు ది ♦ క్తటముల గిఱికొనెఁ, దార లంబరవీథి ♦ దళముకొనియెఁ
గొలఁకులఁ దొగలును ♦ గలువలు వికసించె, జలజాతవిసరముల్ ♦ దలలు వాంచెఁ
గుముదబంధుఁడు తూర్పు ♦ గుబ్బలి నుదయించెఁ, గోకదంపతు లార్తిఁ ♦ గూరి పఱచెఁ
తే. జెలఁగి బలితంపుఁబండువె ♦ న్నెలలు గాసె, విటవిటీజను లెనలేని ♦ వేడ్క తోడఁ
దవిలి విహరింపఁ జాగి రు ♦ ద్దామలీల, నఖిలజంతుసుఖావహం ♦ బయ్యె నపుడు. 59

సీ. పవడంపుఁగోళ్లచ ♦ ప్పరపుమంచము హంస, తూలిక నించిన ♦ పూలపఱుపు
ప్రక్కదిండ్లఁ దలఁతిహళ్ళొం ♦ బట్టుతలాడ మా, నికపుఁగీల్బొమ్మలు ♦ నిలువుటద్ద
ములు తావిసురటీలు ♦ ముకమాలుచందువా, మేలిముత్యాలజా ♦ లీలు పసిఁడి
దివ్వెగంబములు క్రొం ♦ జవ్వాజివంకిణీ, లడపంబు గందంపు ♦ గుడిక లగరు
తే. కరపటంబులు కస్తురి ♦ బరణి తమ్మ
పడగ యత్తరుకుప్పెలు ♦ పైఁడిగద్దె
వీటికాపేటికలును బ ♦ న్నీటిగిండ్లుఁ
గలిగి వెలుఁగొందు కేళికా ♦ గారమునను, 60

క. కాంతారత్నముతో భూ, కాంతాగ్రేసరుఁడు ప్రేమ ♦ గడలుకొనంగాఁ
గంతుక్రీడావైభవ, సంతుష్టస్వాంతుఁ డగుచు ♦ సరవిఁ జెలంగెన్. 61

వ. మఱియును. 62

తే. రత్నశయ్యావితానవి ♦ రాజమాన
మందిరంబుల మణికుట్టి ♦ మస్థలములఁ

బున్నవనములఁ బ్రాసాద ♦ ములఁ గడంక
సుదతియును దాను గ్రీడించు ♦ చున్నయంత. 63

క. ఆ కోడం డెలియఁ గూరిమి, వీరలఁగ సుఖలీల నట్లు ♦ వెలఁగఁగ వరుసన్
నూఱుగురు సుతులు పుట్టిరి, తొఱనిగడితంపుఁగడిమిఁ ♦ దనరెడుబలిమిన్. 64

## సుదతిమగఁడును గొడుకులును యుద్ధములోఁ జచ్చుట.

వ. వా రందఱు నతితరసత్త్వసంపన్నులు నఖండవీరపరాక్రములు నపరిమితతేజోవిరాజితులు నభినవయౌవనారంభులు నశేషశస్త్రవిద్యావిశారదులు నై ప్రవర్తించుచున్న సమయంబున నొక్కనాఁడు. 65

సీ. అపరాబ్ధితీరంబు ♦ నందు రిపుంజయుఁ, డనురాజు దనరు న ♦ య్యర్థనామ
కుఁడు తదాత్మజులు ము ♦ గ్గురు పరంతప పరా, స్కందులు పరవిశో ♦ షకుఁ డనంగ
వెలయుచు రణమహా ♦ వీరవర్యులు ప్రాక్స, యోధిజిగీషఁ జ ♦ మూరుగణ స
మేతులై వచ్చిన ♦ మీపధాత్రీభాగ, మున దండు విడియించి ♦ మొనయుటయును వి

తే. కుండనరపతి నిజపుత్త్రి ♦ కులును దాను, జేర్చిఁ జతురంగబలసము ♦ పేతుఁ డగుచుఁ
దరలి మొనకట్టి ఘోరయు ♦ ద్ధంబు చేసె, నప్పు డుభయబలంబులు ♦ ననికిఁ దొడరి.

క. పరశు గదా పట్టిస ము, ద్గర తోమర భిందిపాల ♦ కౌక్షేయశర
చ్ఛురికాది సాధనంబులఁ, గర మురుదుగ భటులు దుమురు ♦ గావించి రొగిన్. 67

క. పృథుబలసంయుతులు జగ, త్ప్రథితమహాయుధులు ఘోర ♦ గర్వోద్ధతులుం
బ్రథనజయదర్పితులు నగు, రథికులు పోరాడి రధిక ♦ రభసం బెసఁగన్. 68

తే. చిత్రవైఖరి నిశితకౌ ♦ క్షేయకములు, పెత్తికి జవఘోటకంబులఁ ♦ బఱపి బిట్టు
నఱకు లాడిరి రాహుతు ♦ లుఱక నిబిడ, రక్తధారాప్రవాహం బు ♦ రవడిఁ బర్వ.

క. గిరులును గిరులును దాఁకిన, కరణిన్ మదవారణములఁ ♦ గదనంబునకుం
బురికొల్పి వేటులాడిరి, కరివాహకు లపు డఖర్వ ♦ గర్వోద్ధతు లై. 70

వ. మఱియును దురగఖురపుటాంచలోద్ధూతస్ఫీతధరాపరాగరింఛోళి చ్ఛాదితారుణాంశుమండలం బగునబ్బంపనంబు భూరిభేరీపటహనిస్సాణకాహళారవంబువలనను వీరభటోత్కటసింహనాదంబువలనను నిష్ఠురధనుష్టంకారంబువలనను మదోన్నిద్రభద్రదంతావళబృంహితంబువలనను సముత్తుంగతురంగహేషారవంబువలనను ననంఖ్యశంఖనాదంబువలనను నభంగశతాంగనిర్ఘోషంబువలనను గ్రిందుకొని రోదోంతరాళంబు బధిరీకృతం

బె యుండె నందు ఘోరంబుగఁ బో రొనరించి కరితురగవీరభటనికాయంబులు
కాయంబులం బాసి పడియున్న సంగరాంగణంబు పుష్పితపలాశారణ్యంబు తెఱంగునం
బొలిచె రక్తధారాప్రవాహంబు లుప్పొంగి యంబునిధికిం జాగి పాఱె నప్పుడు. 71

తే. రాజు లెదిరించి ఘనసమ ♦ రాజిరమున
నందఱును మ్రగ్గుటయు నికుం ♦ డాధిపతియుఁ
దారసిలి బిట్టు ఘోరయు ♦ ద్ధంబుచేసి
కొడుకుఁగుజ్జులతోఁ గూడి ♦ పుడమిఁ గూలె. 72

## చచ్చినమగనినిగుఱించియుఁ గొడుకులగుఱించియు సుదతి యేడ్చుట.

ఉ. అంత నికుండమానవధ ♦ రాగ్రణిచేడియ తత్ప్రకార మా
ద్యంతము వీనుల న్విని ర ♦ యంబున సాహవభూమి కెంతయు
స్వాంత దలిర్ప నేఁగి కద ♦ నస్థలిఁ బ్రెల్లినప్రాణనాయకుఁ
బంతిగఁ గూలియున్నసుత ♦ వర్గముఁ గన్గొని శోకమగ్న యై. 73.

క. హానాథ హామనోహర, హానిరుపమధర్మశీల ♦ యమితవిభోగా
హానరపాలశిఖామణి, దీనునిక్రియ నిట్లు ద్రెళ్లి ♦ తే కదనోర్విన్. 74.

తే. అమలమణిమయభర్మహ ♦ ర్మ్యాంతరమునఁ, దతమృదులహంసతూలికా ♦ తల్పమున సు
ఖించునీయొడ లీరణ♦క్షితిని బొరలు, చున్న దిపు డేమి సేయుదుఁ♦జెన్ను దఱిఁగి.75.

వ. అని కుమారవర్గంబు గనుంగొని పయింబడి ముంగురులు సెదరఁ గరంబుల నొదల
మోఁదుకొనుచు నెలుం గెత్తి హాబిడ్డలారా యిట్టిఘోరదురవస్థం బొందితిరే యని
వెక్కి వెక్కి యేడ్చుచుఁ బుడమిం బడి పొరలాడుచు నుస్సురనుచు నుమ్మలించుచు
సొమ్మగొనుచు ధూళిధూసరశరీర యై పెద్దయుండడవు దుఃఖించి బడలి యడలుచు క్షు
త్పిపాసాపరవశ యై యేమియుం దోఁపక వనంబునఁ ద్రిమ్మరుచున్నసమయంబున. 76

## సుదతి యాఁకలిగొని మామిడిపండు గో యంబూనిన నది యెట్లును నందకుండుట.

తే. సౌకుమార్యంబుఁ దేజంబు సౌష్ఠవంబు, సౌరభంబును గల్గి యా
నలరుసొంకచూతఫల మందుఁ♦గలుగఁజేసె, హరి యదియు నట్టు లాఁకటఁ♦దిరిగి తిరిగి,

క. చేరువ నమ్మామిడిపం, డారూఢిగఁ గొమ్మ నుండు • నందినయటులే
తోరముగఁ గానిపించినఁ, గోరికఁ జే సాఁచి యందుఁ • గొనఁబోవుటయున్ 78

తే. ఫల మొకించుక యెడఁ గనం • బడి కరమున, కంద కుండిన వే విక్కి • యవ్వధూటి
కోర్కి నప్పుడు వెండియుఁ • గోయఁబోవ, నటులె యెడఁ బాపి కేలికి • నంద దయ్యె.

వ. అప్పు డప్పొలఁతి నితాంతజఠరానలసంతప్తసకలావయవ యగుచు సమీపంబునం బడియున్న పుత్త్రిక నొక్కనిం దెచ్చి వైచి యెక్కి యందుకొనం బోయినఁ దత్ఫలం బందక యంతరంబు గలిగి యుండె నట్లు క్రమక్రమంబునఁ బుత్త్రికశతంబు సోపానపద్ధతిఁ గావించి కోయంబోవుచున్న నది యెప్పటియట్ల యందకున్న నత్యంతదీనానన యై కన్నుల నశ్రుకణంబు లురల నేమియుం దోఁపక చీకాకుపడి ఫలం బెగదిగం జూచుచున్న సమయంబున. 80

విష్ణువు వృద్ధవిప్రుఁడై వచ్చి సుదతికి మేలుచేసి యంతర్హితుం డగుట.

సీ. చినిఁగిననీర్కావి • చిన్నదోవతియును, దట్టంపుఁదెలిజన్ని • దములగుంపు
రదనహీనవిశాల • వదనగహ్వరమును, రహి మించుదండంబు • రాగిచెంబు
దళముగా నరసిన • తలయు గడ్డంబును, జెప్పులు దావళి • దుప్పటియును
మడతలఁ దేఱుచా • మనిచాయ నెమ్మేను, మందయానము జప • మాలికయును

తే. గొనబుమీఱెడుగోపిచం • దనమ్ము దూర్ధ్వ, పుండ్రమును గల్గి యప్పుడు • భూసురోత్త
మాకృతి ధరించి చెచ్చెర • నచ్చెరువుగ, వచ్చె నచ్చటి కిందిరా • వల్లభుండు. 81

క. చనుదెంచి యశ్రుముఖియును, ఘనశోకాన్వితయు క్షుద్వి • కారార్తయు నై
వనిఁ ద్రిమ్మరునమ్మానినిఁ, గని యావృద్ధద్విజుండు • కరుణం బలికెన్. 82

క. ఏమిటి కేడ్చెద విప్పన, భూమిం ద్రిమ్మరుచు ముగుద • పొలఁతీ మూలం
బేమి యిటు లార్తి నడలఁగ, నీమదిఁ గలవగపు తెఱఁగు • నిక్కము చెపుమా. 83

తే. అనుడు నతి పల్కె నీ వెందు • నరుగఁగలవొ, పొమ్ము నాతోడ నీ కేల • భూసురేంద్ర
యని తిరస్కారముగ వచిం • చిన నతండు, హితవచోరూఢి వెండియు • నిట్టు లనియె.

తే. వనిత యిటు లొక్కతెవు నీవు • వనములోన, నలమటించుచుఁ దిరుగుట • యరసి చూచి
తెలిసికొని పోవు టుచితరీ • తిగఁ దలంచి, వచ్చితి నెఱుఁగఁ జెప్పు నీ • వర్తనంబు.

సీ. అనవుడు నచ్చాన • యతని కిట్లని పల్కె, విను భూసురేంద్ర నా • విన్నపంబు
సూర్యోపమానతే • జోనిధి యైనని, కుండధాత్రీనాథ • కుంజరునకు

భార్య నై బహుభోగ ♦ భాగ్యంబు లారూఢి,ననుభవించుచు మనో ♦ జాకృతులును
శస్త్రాస్త్రవిద్యావి ♦ శారదు లగుసూర్వ్య, రాత్మజాలను గాంచి ♦ యతిశయప్ర
తే. హర్షమునఁ గ్రాలుచో నిప్పు ♦ డాహవాంగ
ణమున మగఁడును గొడుకులు ♦ విమతవరుల
చేత హతు లైనఁ దద్వియో ♦ గాతతార్తి
దుఃఖమున నిందుఁ దిరిగెద ♦ దోసఁగు లెసఁగ. 86

తే. అంతకంటెను ఘనతరం ♦ బగుక్షుదార్తిఁ, దివిరి వనియెల్ల నెమకుచుఁ ♦ దిరిగితిరిగి
యక్కజంబుగఁ గొమ్మపై ♦ నొక్కమావి, పండు గనుఁగొంటిఁ గన్నుల ♦ పండువుగను.

క. ఆపండు గోయఁబోయిన, నేపగిదిఁ దొరకకున్న ♦ నెప రొదవనిసం
తాపమున బడలుచుండితిఁ, దాపసవర నాయవస్థ ♦ దైవం బెఱుఁగున్. 88
వ. అనిన నాద్విజపుంగవుం డంగనామణి కిట్లనియె. 89

తే. పతితనూజవియోగార్తి ♦ బడలుచుండి, యతితరం బైనక్షుద్బాధ ♦ వడలుచుండి
యశుచితో నుండి పండు గో ♦ యంగఁ జనిన, నబ్బనే బేల యిత్తెఱఁ ♦ గర్హ మగునె.

తే. నరసి కేతెంచి యందుల ♦ స్నాన మాడి, నిర్మలస్వాంత వై యున్న ♦ నీకు నపుడె
సకలదుఃఖాపహారి యా ♦ సత్ఫలంబు, కరతలాగత మగుఁజుమ్ము ♦ కమలవదన. 91
వ. అనిన నమ్మగువ యిట్లనియె. 92

క. దీనజనావన కరుణాం, భోనిధి నాతండ్రి నీకుఁ ♦ బుత్త్రిని నన్నీ
మాననియాఁకట బడలం, గానీయక వేగ ప్రోది ♦ గావింపఁగదే. 93

తే. అనఘ స్నానంబువలన న ♦ య్యబ్బురంపు, ఫలము చేతికి నెట్లు రాఁ ♦ గలదు పుణ్య
సరసి యెచ్చోట నున్నది ♦ సరగ నాకుఁ, దెలుపవే యని మ్రొక్కి ప్రా ♦ ర్థించుటయును.

ఆ. బ్రాహ్మణుండు పలికెఁ ♦ బరమదయాళుఁడై, ముగుద యనతిదూర ♦ మున సమగ్ర
నిర్మలోద కములు ♦ నెరయుచు నొకకమ, లాకరంబు లీల ♦ వలరుచుండు. 95

తే. కుముదకల్హారకువలయ ♦ కోకనదస, రోరుహేందీవరాకీర్ణ ♦ మై రణన్మ
దాళిసంకీర్ణమై క్రౌంచ ♦ హంసకోక, సంకులంబయి నెతి నక్కొ ♦ లంకు దనరు. 96

సీ. కుంద చందన పిచు ♦ మంద వందక వట, మందార తిందుక ♦ సిందువార
గాల వాంకోల త ♦ క్కోల తమాల హిం, తాల తాల రసాల ♦ సాల తూల

కురువక మరువక • సరళ క్రోకర పూర, కరవీర ఖదిరామ్లి • కా కరీర
నారంగ లికుచ ఖ • ర్జూర జంబీర హ, రీతకీ కేతకీ • మాతులుంగ
తే. పనస ఘనసార కదళికా • ప్రముఖవివిధ, ఫలకుసుమగుచ్ఛకిసలయ • భరనమత్ప్రి
క్లృప్తభూజాతజాత్యమై • కేన్న మగుచు, వఱలుఁ దత్తీరమున నొక్క • వనము తరుణి.

మ. సరసీనిర్మలనీరబిందుకణముల్ • సమ్యగ్గతిం బూని వి
స్ఫురదారామలతాంతసౌరభరజశ్రీ • పుంజంబుఁ గైకొంచు ని
ర్భరమందానిలశాబకప్రకరముల్ • పల్మాఱు నక్కోనలోఁ
దిరుగుం బాంథజనశ్రమాపహరణో • ద్వృత్తిం బ్రకాశించుచున్. 98

తే. తరుణి నీ వచ్చుటికి నేఁగి • తత్తటాక, నీరముల స్నాన మొనరింప • నిఖిలఫలము
చేతి కబ్బును బొమ్మంచుఁ•బ్రీతిఁ జెప్పి,యంత నంతర్హితుం డయ్యె•నాద్విజుండు. 99

వ. అని కుంభసంభవుండు శౌనకమునీంద్రునకుం జెప్పిన నతం డతని నవ్వలికథావిధానం బెట్లని యడుగుటయును. 100

శా. పారావారవిహార హార హిమరు • క్స్ఫాటీర డిండీర మం
దార క్షీర తుషార పారద మరు • ద్గంధేభ తారా సుధా
పూ రేందూపల హీర సార శరదం • భో దాభ్రగంగానద్యు
గ్గౌరస్ఫారయశఃప్రసార హితసం • ఖ్యావత్కులోద్ధారకా. 101

క. శంఖార్బుదసంఖ్యాహిత, పుంఖప్రాణాపహరణ • భూరిరణాంచ
చ్ఛంఖగదాచక్రాయుధ, కంఖాణీకృతవరిష్ఠ • గరుడశ్రేష్ఠా. 102

మాలిని. కథితశుభచరిత్రా • కంజమిత్రాబ్జనేత్రా
మథితఖలసమాజా • మండితాఖండతేజా
పృథులగుణవిహారా • కృత్తమత్తారివీరా
ప్రథనవిగతశంకా • పక్షిరాజోజ్జ్వలాంకా. 103

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణ సంలబ్ధసరసకవితాసామ్రాజ్య ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్ర

సకల సంస్కృతాంధ్రలక్షణ కళాకౌశ లాభిరామ
తిమ్మకవిసార్వభౌమప్రణీతం బైనసర్పపురక్షేత్ర
మాహాత్మ్యం బనుపుణ్యచరిత్రంబునందు
ద్వితీయాశ్వాసము.



శ్రీశారదామ్బాయై నమః.

# సర్పపురమాహాత్మ్యము.



## తృతీయాశ్వాసము.



రుచిరగుణాభరణా
నారదమునివినుతచరణ ♦ నతజనశరణా
ఘోరాంహస్సంహరణా
భూరిజగద్భరణ సర్ప ♦ పురవరశరణా.

వ. అవధరింపుము శౌనకమహామునీంద్రున కగస్త్యుం డిట్లని చెప్పందొడంగె నట్లయ్యాగంతు కాంగనారత్నంబు విప్రవాక్యప్రకారంబున నక్కాసారతీరంబు చేరి తజ్జలంబుల నవగాహనంబుచేసి. 2

### స్త్రీరూపమును విడిచి నారదుండు నిజపూర్వవృత్తముల నెన్నుట.

క. తటిదుపమానజటావలి, పటికపుజపమాల కరవి ♦ పంచియుఁ ధవళో
త్కటతనువుఁ గలిగి మఱి యె, ప్పటినారదమునియ యగుచుఁ ♦ బటుగతి నిలిచెన్. 3

తే. జలధిలోపల వెడలిన ♦ శశియుఁబోలె, నిలిచి యత్యద్భుతం బాత్మ ♦ నిప్పాటిల్ల
స్త్రీత్వసంపత్సుతాదివి ♦ స్తీర్ణపూర్వ, వర్తనం బెల్ల స్వప్నక ♦ ల్పముగఁ దలఁచె. 4

ఆ. తలఁచి కొలను వెడలి ♦ తత్తటాంతికవన, భూమి నొక్కపుప్ప ♦ భూరుహంబు
క్రిందఁ గూరుచుండి ♦ సందేహవివశిత, స్వాంతుఁ డగుచు మఱియు ♦ నాత్మలోన.

ఆ. ఏమియద్భుతం బి ♦ దేమియాశ్చర్య మి, దేమి విస్మయం బి ♦ దేమిచిత్ర
మేమిచోద్య మిది య ♦ హా మును వెన్నఁడు, విననికనని దొడ్డ ♦ వింత పుట్టె. 6

సీ. కలఁ గంటిఁ గాఁబోలు ♦ గణుతించి చూచినఁ, గల యనిద్రున కెట్లు ♦ గలుగ నేర్చు
విభ్రాంతి గాఁబోలు ♦ వివరింప నది వస్తు, దర్శనంబునఁగాని ♦ తవులుకొనదు

మోహంబు కాఁబోలు ♦ నూహింప దానిచే, నూరక తెలివి లే ♦ కుండవలయు
నైంద్రజాలిక మేమొ ♦ యరసి చూడఁగ నట్లు, లైన నిందుఁ బ్రయో ♦ క్త గానిపింపఁ
తే. డహహ గలయును భ్రమయు మో ♦ హంబు నైంద్ర
జాలకంబును గాదు ని ♦ శ్చయ మి దేమి
యద్భుతం బంచుఁ బలుమఱు ♦ నాత్మలోన
నెంచుచు నెంతేనిఁ దవు ♦ లించుచుండె. 7

వ. అంత, 8

సీ. అంగనామణిరూప ♦ మబ్బుటయును మఱి, జాతో ర్త్రియు నిరుంద ♦ జనవరునకుఁ
బ్రియపత్ని యగుటయు ♦ బిడ్డల నూర్వురఁ, గనుటయూ వారు సం ♦ గ్రామభూమిఁ
బడుటయు క్షుద్బాధ ♦ బడలుటయును శవ, సోపానసరణియు ♦ నూరిపరుని
నవప్రకారంబు ♦ వరుసతో స్మరియించి, మదిలోనఁ జాలవి ♦ స్మయముఁ బొంది
తే. యహహ యిదియెన్న విష్ణుమా ♦ యాప్రభావ,మంచు మానసమున నిశ్చ ♦ యించిమున్ను
బ్రహ్మసభలోన నేను గ♦ర్వమునఁ బలికి, నట్టిఫల మిప్పు డనుభవం ♦బయ్యె నిజము. 9

## నారదుండు విష్ణుప్రభావము నెంచి విష్ణువును ధ్యానించుట.

వ. అని విచారించుచుండె నని యగస్త్యుండు శౌనకున కెఱింగించిన నతం డతనికిఁ గ్రమ్మఱ
నిట్లనియె. 10

తే. ప్రవిమలాత్మక కుంభజ ♦ భవ సురర్షి, యట్లు వర్తించుచో నిజం ♦ బరయ నెంత
కాల మయ్యె నెఱింగింపు♦కౌతుకంబు, మఱి మఱియు హెచ్చుచున్నది♦మానసమున.

క. అనిన నగస్త్యుఁడు పలికెన్, విను మొక త్రుటిమాత్ర మయ్యె ♦ వివరింపఁగ న
య్యనఘుఁడు మెలఁగినకాలము, మునివర విష్ణుప్రభావ ♦ ము గడిందిగదా. 12

వ. అనిన శౌనకుం డంతట నారదుం డెట్లు మెలంగె నెఱిఁగింపు మనిన గలశభవుం
డిట్లనియె. 13

క. విను మునినాయక యిత్తెఱఁ, గున సురముని తెలివి దెచ్చు ♦ కొని యామోహం
బును ఘనశక్తియుఁ దనరఁగఁ, దనమది నఖిలేశు నిట్లు ♦ ధ్యానముచేసెన్. 14

క. ఎవ్వనిచే సృష్టం బగు, నివ్విశ్వము ప్రోదిసేయు ♦ నెవ్వాఁడు జగం
బెవ్వనియం దడఁగు నతఁడే, యవ్విభునకు నేను బ్రణతు ♦ లర్థి నొనర్తున్. 15

తే. అచ్చుగఁ జరాచరాత్మకం ♦ బైనయట్టి, యీజగంబు సమస్తంబు ♦ నెవ్వఁ డర్థి
నట్టిజగదీశునకుఁ బర ♦ మాత్మునకును, జిరకృపానిధి కే నమ ♦ స్కృతు లొనర్తు. 16

తే. సర్వభూతాంతరాత్ముని ♦ సర్వవిదుని, సర్వకారణభూతుని ♦ సర్వమయుని
సర్వదురితౌఘహరణుని ♦ సర్వహితుని, సర్వభువనైకనాయకు ♦ సంస్తుతింతు. 17

క. కమలావిభు నారాయణుఁ, గమలభవేశానజనకుఁ ♦ గమలాక్షు నరిం
దము శంఖచక్రయుతకర, కమలున్ భజియింతు హృదయ ♦ కమలమునందున్. 18

తే. శేషపర్యంకశాయి యై ♦ క్షీరజలధి, యందు లక్ష్మిసమేతుఁ డై ♦ యలరువాని
నంతరిక్షంబుకైవడి ♦ నఖిలజగము, నిండుకొనియుండువాని నే ♦ నెఱిఁ దలంతు. 19

తే. ఆదిమధ్యాంతరహితుఁ డై ♦ యలరువాని, నాదిమధ్యాంతకారణుం ♦ డైనవాని
నఖిలకర్మచయాభోక్త ♦ యైనవాని, నఖిలసుఖభోక్తయగువాని ♦ నభినుతింతు. 20

సీ. ఏవిభుపదపద్మ ♦ మింద్రాదిసురశిరో, ధృతపద్మరాగదీ ♦ ధితులఁ బెంచు
నేఘనునామంబు ♦ నిచ్చనైన వచింపఁ, గైవల్యనగరసౌ ♦ ఖ్యంబుఁ గూర్చు
నేదేవుమూర్తి యో ♦ గీంద్రమానసపద్మ, కర్ణికాంతరములఁ ♦ గలసి మెఱయు
నేప్రభుకరుణాని ♦ రీక్షణం బార్యుని, సకలకల్యాణభా ♦ జనముఁ జేయు
తే. మహిమ నెవ్వనిచారిత్ర ♦ మహరహంబు, బ్రహ్మహత్యాదిఘోరపా ♦ పము లడంచు
నయ్యనంతు రమాకాంతు ♦ నధికశాంతు, నిరుపమస్వాంతు భగవంతు ♦ నే భజింతు. 21

ఉ. కిన్నరసిద్ధసాధ్యసుర ♦ ఖేచరయక్షభుజంగముఖ్యు ల
త్యున్నతభక్తిఁ దన్ గొలుచు ♦ చుండిన వారల కెల్ల నెన్నఁడున్
బన్నము లంట నీయక కృ ♦ పామతి నెవ్వఁడు ప్రోదిసేయు న
ప్పన్నగరాజశాయిని బ్ర ♦ పన్నగణాభయదాయిఁ గొల్చెదన్. 22

తే. అనలుఁ డొకఁ డయ్యు జగతిపై ♦ నన్నియెడల
స్థూలసూక్ష్మాకృతులఁ దన ♦ ర్చుచు వెలుంగు
నట్లు దా సర్వభూతాంత ♦ రాత్ముఁ డగుచు
నలరుపరమాత్ము నెప్పుడు ♦ నాశ్రయింతు. 23

తే. నటుని తెఱఁగున బహురూప ♦ నామభేద, ముల మెలంగుచు నేమహా ♦ త్ముఁ డచరాచ
రం బగుప్రపంచ మెల్ల ని ♦ రంతరముగ, నిండుకొనియుండు నవ్విశ్వ ♦ నిలయుఁ గొల్తు.

తే. ఆజనహపాత్రీక్షముఖనిఖి • లామరులును, మఱియు సనకాదికాశేవ • మానివరులం
మానసంబుల నెవ్వాని•మాయఁ దవిలి, భ్రాంతి వహియింతు రమ్మహా•ప్రభు నుతింతు.

క. నీరజగర్భాండోదరు, నారాయణు నఖిలమునిజ • నత్రాణకళా
పారీణు సకలజగదా, ధారు ననాధారు మదిని • దలఁతుఁ గా భక్తిన్. 26

తే. నిఖిలకల్యాణగుణపయో • నిధి కృపాబ్ధి, శంఖచక్రగదాధర • సర్వఫలద
దేవదేవేశ పరమేశ • దీనజనక, నిగమవేద్య ప్రసన్నుఁడ • వగుము సాకు. 27

తే. అజ్ఞుఁడ జడుండ ని న్నెట్టు • లభినుతింప, నేర్తు నజ్ఞానమునఁ జేసి • నేను విష్ణు
మాయఁ గడచితి నన్నట్టి • మాటతప్పు, క్షమ యొనర్చి రయంబ నన్ • గావు మధవ.

తే. స్వామి భవదంఘ్రియుగసమా•శ్రయణగౌర, వమున మూఢుఁడ నై నేన • పల్కినట్టి
తప్పు సహియించి ప్రోవు మా•ధవ ముకుంద, పుండరీకాక్ష హరి సర్వ•భువనరక్ష. 29

## నారదునకు విష్ణువు ప్రత్యక్ష మవుట.

సీ. సర్వలోకేశ్వర • సర్వశరణ్యా యా, శ్రితజనవత్సల • శ్రీనివాస
పద్మాక్ష మద్భావ • పరిశోధక కృపాబ్ధి, నారాయణ ముకుంద • వారణేంద్ర
వరద గోవింద భ • వత్కటాక్షామృతా, చితజలంబుల నభి • షిక్తుఁ జేసి
నన్ను రక్షింపు మ • నాథనాథ యటంచు, దృఢభక్తిమైఁ బ్రస్తు • తించుటయును
తే. నతనిభక్తికిఁ బ్రముదిత • స్వాంతుఁ డగుచు, భావనారాయణస్వామి • పతగరాజ
వాహనుండును గరుణావి•వర్ధనుండు, నగుచు నమ్ముని ముందటఁ బ్ర•త్యక్ష మయ్యె. 30

వ. అప్పు డచింత్యాద్భుతరూపలావణ్యయౌవనామృతసముద్రుండును, దరుణారుణాంశు మండలమండితానర్ఘ్యమణిగణకిరణ సంఘాతదేదీప్యమాన కిరీటాన్వితోత్తమాంగుండును, బురందరనీలనికాశ కేశపాశుండును, సుప్రకాశుండును, శుచిస్మిత సుధా పరిపూర్ణ పూర్ణిమాచంద్రబింబోపమానవదనుండును, జగత్సదనుండును, మకరకేతననూతన ధనుర్లతానదృశనవిభ్రమభ్రూయుగళుండును, గంబుకంఠుండును, బ్రభాతసమయ సముద్దీప్తసహస్రకిరణ తరుణ మయూఖౌఘ ప్రభిన్నసితాంభోజలోచనుండును, గలుష మోచనుండును, గించిదున్నీలితలాలిత చాంపేయముకుళాభిరామనునాసుండును, మహోల్లాసుండును, ధాళధళ్యప్రభాపూరహారిహీరశకలోపమాన రదనసముదయుం డును, సుహృదయుండును, వసంతావసరలసితనవకిసలయాంభోజరాగసమానమానిత శోణాధరుండును, శ్రీధరుండును, మకరకుండలమణి ఘృణివిరాజమానశ్రీకారరేఖా

తులిత శలితశబ్దగ్రీవుండును, దుష్టనిగ్రహుండును, నవీనకందర్పదర్పణప్రతీకాశ ధగద్ధగాయమానగండభాగుండును, మహాభాగుండును, గనక కేయూర సరోరుహ మాలికారుచిరదిక్కరీంద్ర శుండాలదండసదృగ్పీన వృత్తాజాను చతుర్బాహుండును, బ్రసన్న చాతకాంబువాహుండును, నిరుపమమాణిక్యఖచిత శుచితరకనకకంకణా త్యుద్రముద్రికాకీర్ణనిర్ణిద్రశోకనదప్రవిభ్రటాభాసమానకరాంభోజుండును, దివ్యతేజుండును, శ్రీవత్స కౌస్తుభాస్తోకముక్తాహార వనమాలికాసహితమహోరగ ప్రదేశుండును, నిరీశుండును, యమునాతరంగరంగత్రిభంగుండును, నభంగుండును, సురుచిరరత్న సంస్థాపితకాంచనకౌశేయవసనావృతకటిస్థలుండును, నిస్తులుండును, సమున్నతకలభ కరనిభోరుకాండుండును, మహాప్రభుండును, బ్రత్యగ్రముక్తాఫలవిమలనఖరాంకుర ప్రకరుండును, సుకరుండును,హల కులిశ జలచర శంఖ చక్ర ముఖలాంఛనాభిశోభిత సమదర్శునత్కారనూపురాలంకృతచరణారవిందుండును, సదానందుండును, సజలజల దాభిరామశ్యామలకోమలదివ్యమంగళగాత్రుండును, ధాత్రీకళత్రుండును, నరిదరగదా ఖడ్గశార్ఙ్గోపేతుండును, బ్రహ్మాండభాండపిచండుండును, నఖండసచ్చిదానందవిగ్రహుండును, నాదిమధ్యాంతరహితుండును, నఖిలభువనజనకుండును, ననంతసహస్రార్బుదమార్తాండతేజోవిరాజమానుండును, నభంగవీరపరాక్రముండును,నపవర్గలక్ష్మీప్రదుండును, ననేకాద్భుతదివ్యలీలావతారుండును, నపారకృపారసపేశలుండును, నాశ్రితరక్షాధురీణుండును, నార్తజనశరణ్యుండును, నాగమాంతవేద్యుండును, నభేద్యుండును, నజేయుండును, నప్రమేయుండును, నక్షరుండును, నాత్మమయుండును, ననంతుండును, నద్వయుండును, నభవుండును, నగునాయ్యాదినారాయణుం బొడగని సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి యమందానందకందళిత హృదయారవిందుం డగుచుం గరకమలంబులు మొగిడ్చి నారదుం డిట్లని వినుతింపఁదొడంగె. 31

## విష్ణువును నారదుండు వినుతించుట.

సీ. సనకాదిమునిమన ♦ స్సరసిజభ్రమరాయ, వారణేన్ద్రవిపన్ని ♦ వారణాయ
శతమఖప్రముఖని ♦ ర్జరగణప్రణుతాయ, ఘోరసంసారాబ్ధి ♦ తారణాయ
నలినగర్భాణ్డమ ♦ ణ్డలబృహజ్జఠరాయ, క్రూరదైతేయవి ♦ దారణాయ
కమలావధూముఖ ♦ కమలాబ్జమిత్రాయ, దరసుదర్శనశార్ఙ్గ ♦ ధారణాయ
తే. భువతరాశేషభువనైక ♦ కారణాయ, సతతపాలితమునిసిద్ధ ♦ చారణాయ
సర్పనగరానవరతప్ర ♦ చారణాయ, భావనారాయణాయ తు ♦ భ్యం నమోఽస్తు.

దండకము. శ్రీమత్పయోరాశి కన్యాకుచద్వన్ద్వసంలిప్త కస్తూరికాగన్ధపారాఙ్కితస్ఫార
దోరన్తరాళాయ విధ్వస్తనస్సారకాసారమాద్యన్మరాళాయ నీళాపరీరమ్భసమ్భోగ
కేళీవిహారా నిశాత్యన్తసన్తుష్టచేతోరవిన్దాయ సంరక్షితామర్త్యబృన్దాయ కన్దర్పకో
టీస్ఫురద్దివ్యసౌన్దర్యరేఖాపరిభ్రాజమానాయ నానాయతీన్ద్రాదిరాఙ్ఘ్యసన్నిధానాయ
కారుణ్యమేధానసనాథాయ వేధోమరుత్వద్దినాధీశకీనాశ ఫేశాన లాహీశ ముఖ్యామర
స్తోమమస్తస్థలన్యస్తసౌవర్ణకోటీరకోటీరతామ్భోజరాగ ప్రభాపూరనీరాజితాఙ్ఘ్రిత్వదే
ధోరితో గ్రాపదే శౌనకాగస్త్య వల్మీకజ వ్యాస వాసిష్ఠ కణ్వాత్రి గాధేయ కౌణ్డిన్య
శాణ్డిల్యమాణ్డవ్య ముఖ్యాఖిలర్షిప్రసంస్తూయమాన స్థిరోదారభాస్వచ్చరిత్రాయ మి
త్రేన్దునేత్రాయ మీనాద్యనన్తావతారాయ ధీరాయ ఘోరాఘసఙ్ఘాతకుస్సాటవీ
హవ్యవాహాయ మానప్రకృష్టోరునామ్నే సముద్యన్మహిమ్నే పదాఙ్గుష్ఠ నిష్ఠ్యూత
గఙ్గానదీస్వీరధారావళీక్షాళితాశేషదోషాయ నిత్యప్రతోషాయ దోషాచరాదభ్రకా
లాభ్రఝఝ్ఝాసమీరాయ వీరాదివీరాయ క్షీరార్ణవాక్రాన్తలీలా విహారాయ
పుణ్యప్రచారాయ జామ్బూనదస్ఫీతపీతామ్బరాలఙ్కృతాఙ్ఘ్రుత్కటీరాయ శూరాయ
గమ్భీరనీరాన్తరాళోగ్రకుమ్భీరసంరుద్ధకుమ్భీన్ద్రసంరక్షణాదమ్భసంరమ్భ సమ్భావనా
నాయ సమ్మోదితాశేషదీనాయ నీరేజగర్భాణ్డభాణ్డచ్ఛటా పూరితోద్యత్పిచణ్డాయ
సఙ్గ్రామకేళీప్రచణ్డాయ సృష్టిస్థితిధ్వంసనప్రక్రియాహేతవే పక్షిరాట్కేతవే పద్మ
నాభాయ ప్రావృష్ణనాభాయ సద్భక్తసంరక్షణామోఘవిద్యాప్రవీణాయ వేదప్రమా
ణాయ సంసారదుర్వ్యాధివైద్యాయ వేదాన్తవేద్యాయ నిర్వాణసామ్రాజ్యలక్ష్మీప్రదా
త్రే ప్రజానాథపిత్రే నమో విష్ణవే భాగ్యవర్ధిష్ణవే కృష్ణరూపాయ విశ్వస్వరూపాయ
తుభ్యం నమశ్శఙ్ఖచక్రాసి కౌమోదకీ శార్ఙ్గహస్తాయ లోకప్రశస్తాయ తుభ్యం నమ
స్సర్వకామార్థ సంస్థాయినే సర్వభూతాన్తరస్థాయినే సర్వపూర్వ్యాప నారాయణ
స్వామినే సిన్ధుజాకామినే సర్వలోకైకకర్త్రే నమస్సర్వహర్త్రే నమో వాసుదేవాయ
దేవాదిదేవాయ తుభ్యం నమస్తే నమస్తే నమః. 33

మ. పురహూతప్రముఖాఖిలామరశిరో • భూషాగ్రరత్నచ్ఛటా
నిరవద్యానుపమప్రభోత్కరముహు • ర్నీరాజితాంఘ్రిద్వయున్
శరణం బొందిద నిన్ను నన్ను నెపుడున్ • సంప్రీతి రక్షింపు సు
స్థిరకారుణ్యకటాక్ష సర్వనగర • శ్రీభావనారాయణా. 34

క. శతధృతిశతమఖముఖులకు, శ్రుతులుం గొనియాడలేని ♦ చో నే నిన్నున్
నుతియింప నెంతవాఁడను, నతరక్షణదీక్ష సర్ప ♦ నగరాధ్యక్షా. 35

క. ఏ మనియెద నాభాగ్యము, నీముఖచంద్రోదయమున ♦ నెఱి నుప్పొంగెన్
నామానసార్ణవం బిపు, డో మహనీయప్రభావ ♦ యోగిశరణ్యా. 36

వ. మహాత్మా భవదాలోకన ప్రసారణ దవానలంబున మదీయ పూర్వ జన్మ సంభృతకిల్బిషారణ్యంబు దగ్ధం బయ్యె భవదీయకృపాపూరప్రసారణంబున నఘానలతప్తంబులగు నింద్రియంబులు ప్లావితంబు లయ్యె నింక మదజ్ఞానఘనధ్వాంతవిభాకరుండ వగునిన్ను నెప్పుడు ధ్యానం బొనర్చెద నీయనంతకల్యాణగుణానీకం బనవరతంబుఁ గీర్తించెద భవద్భక్తపదాంభోజదర్శనమనోరథుండ నై మూఁడులోకంబుల సంచరించెద నని ప్రార్థించుచున్న నారదునకు భగవంతుం డిట్లనియె. 37

## నారదునకు విష్ణు వనుగ్రహంబుఁ జూపుట.

సీ. నీయభిప్రాయంబు ♦ నే నెఱుంగుదు వత్స, సకలభూతాంతరా ♦ త్మకుఁడ నైన
నా కెద్దియును గాన ♦ రాకుండునది లేదు, నామాయఁ దరియింప ♦ నాకులకు మ
హర్షుల కైన శ ♦ క్యంబుగా దిట్లు లో,కుల కిది దెలుపుట ♦ కొఱకుఁ బూని
యేను నీచేతఁ జే ♦ యించితి నింక నీ, వళుకక స్థైర్యంబు ♦ గలిగియుండు

తే. ధరణి నీపేర నీసరో ♦ వర మశేష, పాతకవ్రాతనాశక ♦ మై తనర్చు
విజ్జలంబుల మునిఁగిన ♦ సజ్జనుండు, పొసఁగ నఖిలశుభంబులఁ ♦ బొందుఁజుమ్మి. 38

తే. అమితకలుషాకరం బగు ♦ నట్టి స్త్రీత్వ, మాగతం బయ్యె నిత్తటా ♦ కావగాహ
నమున నటు లైన నిది భవ ♦ న్నామకమున, వఱలుఁబో నీవు మద్భక్త ♦ వరుఁడ వగుట.

తే. ఇత్తటాకంబు మది స్మరి ♦ యించుజనుల, కఖిలకలుషాపహరణంబు ♦ యతికులేంద్ర
సంతసంబున మునిఁగెడు ♦ స్నాతజనుల, కెల్ల నిది పుత్రసంపత్స ♦ మృద్ధిదంబు. 40

క. విను మత్సంకల్పంబున, మునివల్లభ నీకు స్త్రీత్వ ♦ ము ఘటిల్లె నటుల్
జనులుఁ మత్సంకల్పం, బునఁ గడుశుభసంతతులను ♦ బొందుదురుసుమీ. 41

తే. మునికులోత్తంస యద్భుతం ♦ బుగను నీకు, సంగనాత్వవినిర్ముక్తి ♦ యయ్యెఁ గాన
నది ధరిత్రీస్థలిఁ బ్రసిద్ధ ♦ మగుచు నెపుడు, ముక్తికాసార మను పేర ♦ మొనసియుండు.

క. ఇచ్చెఱువున మునిఁగినజనుఁ, డచ్చెరువుగ దురితరహితుఁ ♦ డై శుభఫలముల్
గ్రొచ్చుకొని యనుభవించుచు, విచ్చలవిడిఁ బుత్రపౌత్ర ♦ వృద్ధిఁ జెలంగున్. 43

క. ఇది మొదలుగ నీవరసిక్తా, ముదమునఁ గ్రుంకు లిడుజనుఁడు ♦ ముక్తుండై య
త్పదమునకు నరుగుఁ గొదుకక, తుది భవబంధములఁ బాసి ♦ ద్రుహిణతనూజా. 44

తే. సిద్ధముగ ముక్తికాసార ♦ జీవనావ
గాహన జనాఘనిచయ మొ ♦ క్కటను మార్పు
లార్చుచును రోదనంబు సే ♦ యుచును జాల
నద్భుతముగఁ బలాయితం ♦ బగుచు నుండు. 45

తే. గణుతి యొనరింప మూఁడులో♦కములయందుఁ, బావనము లైనతీర్థంబు ♦ లేవి గలవ
వన్నియును నిందు వసియించు ♦ నహరహంబు, నమరమునిచంద్రదివిజసంశ♦యంబు లేదు.

తే. అవని మానవుఁ డిచ్చ లే ♦ కైన నీస, రోవరోదక మించుక ♦ గ్రోలెనేని
యాక్షణంబున వెసఁ బలా ♦ యనము నందు, బ్రహ్మహత్యాదికము లైన ♦ పాతకములు.

తే. ముక్తికాసార మను పేరు ♦ మొనసి మనుజుఁ, డాత్మలోపల స్మరియించు ♦ నంతమాత్ర
మున నశేషాఘభవబంధ ♦ ములను బాయు, స్నానఫల మేమిచెప్పెదు ♦ సంయమీంద్ర.

తే. గ్రహణవేళల విషువసం♦క్రాంతిదినుల, నయనములయందు మూలాన్వి♦తాహములను
దవిలి స్నానం బొనర్చిన ♦ ధన్యుఁ డొందు, నశ్వమేధసహస్రస ♦ మ్యక్ఫలంబు. 49

తే. పూషుఁడు మకరస్థుం డైన ♦ పుడును మాఘ, మాసములయందు నాదిత్య♦వాసరముల
హరిదినంబుల స్నానమం ♦ దాచరించు, ఫలము వాక్రువ్వ నజునకు ♦ నలవిగాదు.

సీ. ఇమ్ముక్తిసరసీత ♦ టమ్మున విమలోద, కములచేత నివాప ♦ కరణ మాచ
రించుటవలనఁ బి ♦ తృశ్రేణులకు ముక్తి, కరతలస్థం బయి ♦ పరఁగు జహ్ను
తనయాదిపుణ్యతీ ♦ ర్థములనివాపాంజ, లులచేత నయ్యెడు ♦ ఫలము జనుల
కిచ్చట సిద్ధించు ♦ నెన్నంగ గంగాది, పుణ్యతీర్థము లెన్ని ♦ భువిని గలుగు
తే. నన్నియును నిందు వసియించు ♦ నహరహంబు, ఘనతరంబుగ నాదునం ♦ కల్పమునను
బితరులకు నెవ్వఁ డిచ్చోటఁ ♦ బిండ మొసఁగు, నతఁడు తరియింపఁజేయుస్వ♦పితృజనులను.

క. వటవిటపిక్రింద గయలోఁ, బటుమతిఁ బిండంబు విష్ణు ♦ పదమున నిడు మేల్
ఘటియించు ముక్తిసరసీ, తటమునఁ బిండం బొసంగు ♦ ధన్యాత్ములకున్. 52

ఆ. అఖిలయజ్ఞభోక్త ♦ నైననే నిచ్చట, నధివసించి జనుల ♦ కఖిలఫలము
లొసఁగుచుందు వినుము ♦ యోగికులోత్తమ, మహిమ విస్తరిల్ల ♦ నహరహంబు. 53

క. నీమీఁది ప్రేమమున నిం, దే మునివర నిలిచియుండు ♦ సర్వ జనులచే
సేమమునఁ బూజగొనుచు మ, తే మిఁక దుర్లభము జనుల ♦ కిలఁ గల దరయన్. 54

క. నారద యిమ్ముక్తిసర, స్తీరంబునఁ జేయుజప ము ♦ చితదానంబుం
జేరిమి నస్వాదె జనులకు, సారం బైవట్టిఫలము ♦ సమకూర్పఁజామీ. 55

సీ. విను మింక మాటలు ♦ వేయు నేల మునీంద్ర, గురుతల్పగసురాప ♦ గోఘ్నమాతృ
హంతుఁ బరదారర ♦ తులు భ్రూణహంతలు బ్ర, హ్మఘ్నులుఁ గనకాప ♦ హరణు లాది
గలమహాపాతకు ♦ లెలమి నీసరసీస్వ, యంబున స్నానంబు ♦ లాడిరేని
యప్పుడే వారు ఘో ♦ రాఘనిర్ముక్తు లై, సురుచిరైశ్వర్యంబు ♦ సుతసమృద్ధి
తే. యాయురారోగ్యసంపద ♦ యతిశయిల్ల, సంత్యమున విష్ణులోకసౌ ♦ ఖ్యానుభవని
రంతరామోదమేదుర ♦ స్వాంతు లగుచు, నలరు చుందురు సుమ్ము త ♦ థ్యంబుగాఁగ.

వ. అని యిట్లు భగవంతుం డానతిచ్చిన నారదుం డమ్మహానుభావున కిట్లని విన్నవించె.

తే. అధవ మద్భావమాలిన్య ♦ మపహరించు, కొఱకు నీ విలఁ బ్రఖ్యాతి ♦ మెఱయనిందు
భావనారాయణస్వామి ♦ వై వసించి, యున్నవాఁడవు గద భువ ♦ నోపకృతిగ. 58

తే, రమ్యపాదపనివహావి ♦ రాజితంబు, పావనం బైనయీసర ♦ వరతటమున
రూఢి మీఱంగ నర్చాస్వ ♦ రూపమునను, వనజలోచన నీ వుండ ♦ వలయుఁ జుమ్మి.

వ, అయిన నిన్నుఁ బ్రతిష్ఠాపితుం జేసెద నని యుత్సహించెద దానం జేసి నాకు నిర్దోషంబు
పరిహారం బగు భవత్కటాక్షవిక్షేపంబునఁ బ్రసిద్ధుండ నగుదుఁగదా యని విన్నవించిన
జనార్దనుండు వెండియు నతని కిట్లనియె. 60

తే. మున్న చెప్పితిఁ బన్నగ ♦ ముఖ్యుఁ డైన, యయ్యనంతుని కిమ్మాట ♦ నెయ్య మలర
నట్లుగావున నిచ్చోట ♦ నధివసింతు, నట్లె కావింపు మిఁక మునీం ♦ ద్రాగ్రగణ్య. 61

వ. అని యాశ్రితాధీనవర్తనుం డగు గరుడధ్వజుం డానతిచ్చిన లోకానందకరం బైనవాక్యం
బఖిలంబు నాకర్ణించి పరితుష్టుఁ డగుచు నమ్మునిశ్రేష్ఠుండు ప్రతిష్ఠావిధానంబుఁ బ్రయ
త్నంబు సేసె నని శౌనకున కగస్త్యుం డెఱింగించినఁ గ్రమ్మఱ నతం డతని కిట్లనియె. 62

## నారదుఁడు భావనారాయణునిఁ బ్రతిష్ఠ సేయుట

క. ఆరయ నఖిలజ్ఞుం డగు, నారదమునివరుఁడు భావ ♦ నారాయణు ల
క్ష్మీరమణీరమణునిఁ దా, నేరతిఁ బ్రతిష్ఠసేసె ♦ నెఱిఁగింపఁగదే. 63

వ. విస్మయానందకారణం బగు ప్రతిష్ఠావైభవంబు నాకుం దెలుపు మనినం గలశోద్భవుం డిట్లనియె. 64

క. శంభుండు జంభవిరోధియు, నంభోజభవుండు శశియు ♦ నర్కుడు దివిజుల్
రంభాదులుమునులుకా నం, రంభంబున వచ్చి రపుడు ♦ రహి నచ్చటికిన్. 65

వ. అప్పు డజాండు నభోమాసంబున శుక్లపక్షంబున గురువాసరంబున సింహలగ్నంబునం గనత్కనకప్రాకారసంవృతంబును రత్నగోపురవిరాజితంబును జిరత్నరత్నఖచితవితర్దికాసోపానమండపకుట్టిమద్వార బంధబంధురంబును మణిస్తంభసహస్రభాసితంబును విశ్వకర్మనిర్మితంబు నగుమహనీయప్రాసాదాంతరంబున సముత్తుంగభద్రసింహాసనంబున శ్రీమద్భావనారాయణదేవు లక్ష్మీసమేతు విధ్యుక్తప్రకారంబున సంస్థాపితుం జేసె నయ్యవసరంబున. 66

సీ. దేవదుందుభిమహా ♦ రావంబు లెసంగె గం, ధర్వకిన్నరులు గీ ♦ తములు వాడి
రప్సరోభామినుల ♦ లదనొప్ప నాడిరి, జలదముల్ పుష్పవ ♦ ర్షంబు గురిసె
మునులు సామామ్నాయ ♦ ముల వినుతించిరి, మనుజులెల్ల శుభతూర్య ♦ ములు సెలంగ
ననిమిషుల్ జయజయ ♦ ధ్వనులతోం గీర్తించి, రమకూలగంధవా ♦ హములు వీచె
తే. నంత బ్రహ్మపురందరా ♦ ద్యమరవరులు, నారదాదిమహాముని ♦ నాయకులును
భావనారాయణస్వామి ♦ దేవదేవుం, బ్రీతిం బొగడిరి మంగళ ♦ గీతములను. 67

వ. మెండియు నద్దేవు నిట్లని వినుతించిరి. 68

## దివిజమునిముఖ్యులు స్వామిని నుతించుట.

తే. దేవదేవ జనార్దన ♦ దివిజవినుత, యఖిలలోకైకకారణ ♦ యప్రమేయ
భూతభవ్యభవన్నాథ ♦ భువనవంద్య, వేదవేద్య రమాధీశ ♦ విశ్వనిలయ. 69

సీ. దివి మస్తకము చంద్ర ♦ దినకరుల్ కన్నులు
వహ్ని ముఖంబు దే ♦ వతలు భుజము
లవని యంఘ్రులు విహా ♦ యసము పొక్కిలి దిశల్
శ్రవణంబు లామ్నాయ ♦ సమితి వాక్కు
లనిలుండు ప్రాణంబు ♦ యముండు మానసము నా
కంబు కంధరమును ♦ గచభరంబు
భారతి నాలుక ♦ పాథోనిధులు కుక్షి
క్రతుభుక్చికిత్సకుల్ ♦ కటితలంబు

తే. గాఁగ విశ్వస్వరూపి వై ♦ తనరుచుండియు, నుండు నీమేన నలినగ ♦ ర్భాండభాండ
మండలు లుదుంబరఫలోప ♦ మానము లయి, వెలయుచుండుఁగదా జగ ♦ ద్వినుతచరిత.

వ. అనంతబ్రహ్మాండసంఘాతంబు లెవ్వానినిశ్వాసోచ్ఛ్వాసద్వయంబున విడువం బడుచు నాహరింపంబడుచుండు నెవ్వానినిమేషోన్మేషంబుల నఖిలలోకసముదయం బడఁగుచుం బొడముచుండు నట్టియఖిలలోకశరణ్యుండ వగునట్టినీకు నమస్కారంబు. 71

తే. అమరవరులకు నైన మ ♦ హర్షిజనుల, కైన నీమాయఁ గడవ శ ♦ క్యంబు గాదు
హీనమతు లగువారి కిం ♦ కేమి చెప్ప, భక్తవత్సల జగదీశ ♦ పరమపురుష. 72

తే. మానిజనవంద్య మమ్ము నీ ♦ మాయవలన, దాఁటఁగాఁజేయు మేతద ♦ ర్థంబు నిన్ను
శరణుఁ గంటిమి నీపాద ♦ జలజయుగము, కృష్ణ మా కన్యసాధనం ♦ బెన్నఁ గలదె.

క. శరణాగతజనభయసం, హరణాయ నమ స్తమునిజ ♦ నార్చితశుభకృ
చ్చరణాయ నిత్యనిర్మల, కరుణాయ సుధీనుతప్ర ♦ కరణాయ నమః. 74

వ. అని యిట్లు బహుప్రకారంబుల నద్దేవదేవుం బ్రణుతించి మఱియు శ్రీమహాలక్ష్మి నిట్లని వినుతించిరి, 75

## దివిజమునిముఖ్యులు లక్ష్మిని నుతించుట.

క. కమలా బుధజననుతపద, కమలా కరధృతనవీన ♦ కమలా విలస
త్కమలావాసిని మము నీ, విమలకృపాలోకనమున ♦ వీక్షింపఁగదే. 76

తే. మణిమయస్వర్ణపూర్ణకుం ♦ భములు పూని, తవిలి యిరుగడఁ గరికులేం ♦ ద్రములు గొల్వఁ
జామరంబులు పూని ని ♦ ర్జరవధూటు, లెలమి భజియింప నలరు నిన్ ♦ గొలుతు మంబ.

ఉ. నీకరుణావిలోకనము ♦ నిల్చినచోఁ గులహీనుఁడున్ హయా
నేకపహేమచామరమ ♦ ణీరమణీయవిభూషణాదికా
స్తోకవిభూతిఁ జెంది పరి ♦ శుద్ధకులుం డన మించు లేనిచో
నాకనివాసుఁడున్ వెతల ♦ నందుఁగదమ్మ జగత్కుటుంబినీ. 78

చ. ఉవిద లనంగుఁ డంచు విబు ♦ ధోత్తము లర్కతనూజుఁ డంచు శా
త్రవులు కిరీటి యంచు వసు ♦ ధాజను లెల్లఁ బ్రభుం డటంచు బాం
ధవులు సముద్రుఁ డంచు వి ♦ తతంబుగ నెన్నుదు రొట్టిదుర్జన
ప్రవరుని నైన నీకరుణ ♦ పర్వినవాని సరోజగేహినీ. 79

మ. పురజి ద్ధ్యానవతీ త్సుధాశనవ రాం ♦ భోధీశ యక్షాధి పా
శరరా డ్వహ్ని పరేత రాజ మరుదీ ♦ శానాదికం బైనయీ
సురబృందంబు భవత్కృపాగరిమ న ♦ త్యుద్రప్రభావంబుతో
నిరవొందుంగద కేశపాశజితమ ♦ త్తేందిందిరా యిందిరా. 80

క. ఓజనని నీవు గలచో, నేజాతివిహీను నైన ♦ నిలఁ గొలఁతురుగా
రాజులుఁ గవిరాజులు బుధ, రాజులు గమికట్టి కదలి ♦ రాయనిపట్టీ. 81

చ. మతి మఱి పూను నన్నరను ♦ మందతఁ జెందుఁ గృశించు మాటికిన్
వెతపడు నీచవర్తనుల ♦ వేడఁగఁ జాచు విధిన్ నశించు లో
ధృతి చెడి క్రుంగుఁ జెంగగొను ♦ నెట్టిమహోన్నతుఁ డైన నీజగ
ద్ధితకరుణారసప్లుతని ♦ రీక్షణ మబ్బని వేళ శ్రీసతీ. 82

చ. అతితరవేదశాస్త్రనిగ ♦ మాంతపురాణకథావిధానవి
శ్రుతుని దరిద్రుఁ జేయుదువు ♦ చూడ నికృష్టుఁ బ్రికృష్టభాగ్యసం
యుతునిఁగఁ జేయుచుందుదువ ♦ హో పరికింప జగంబులందు న
ద్భుతముగదమ్మ నీమహిమ ♦ తోయజనాభవిలాసినీమణీ. 83

సీ. కడసి నిన్నిల్లాలిఁ ♦ గాఁ జేసికొనిగదా, హరి పురుషోత్తముం ♦ డనఁగఁ బరఁగెఁ
దివిరి నీతోడను ♦ ద్భవము నొందుటఁగదా, శశికి రాజత్వంబు ♦ సంభవించెఁ
గోరి నిన్నారావుఁ ♦ గూఁతుఁ గాంచుటఁగదా, వనరాశి రత్నాధి ♦ వాస మయ్యెఁ
దర్శింపఁ నీకు నం ♦ దనుఁ డౌటచేఁగదా, మారుండు మోహనా ♦ కారుఁ డయ్యె
తే. నహహ భవదీయదివ్యమా ♦ హాత్మ్య మెన్న, నలవిగాదుగదమ్మ శే ♦ షాహికైనఁ
గలితశుభగాత్రి పరచిత ♦ కాళరాత్రి, సకలలోకైకజనయిత్రి ♦ జలధిపుత్త్రి. 84

వ. అని వినుతించుదివిజమహర్షివరులం గనుంగొని యానందోత్ఫుల్లమానసుం డగుచుఁ
బితామహుం డిట్లనియె. 85

## బ్రహ్మ దేవాదులకు హితంబు బోధించుట.

క. సురలార పరమసంయమి, వరులార సమస్తభువన ♦ వంద్యం డగునీ
హరి నీక్షింపుఁడు మీకుం, జిరతరశుభఫలము లిపుడె ♦ చేతికి వచ్చున్. 86

క. కనుఁగొనుఁ డీదేవుని లో, చనములు గలఫలము పూజ ♦ సలుపుఁడు కరముల్
దనరుటకు ఫలము జిహ్వాక, తొనరుటకు ఫలంబు పొగడుఁ ♦ డురగశయానున్.

తే. శ్రుతులు గలఫల మిమ్మహా ♦ వ్రతునికథలు
వినుఁడు చరణద్వయంబుగ ♦ ల్గినఫలంబు
పాయక ప్రదక్షిణంబులు ♦ సేయుఁ డుత్త
మాంగము గలందులకు మ్రొక్కఁ ♦ డచ్యుతునకు. 88

తే. వినుఁడు సురలార మునులార ♦ వీను లలర, భావనారాయణునకు న ♦ ద్భక్తితోడ
ధరణిఁ జాఁగిలి మ్రొక్కిన ♦ ధన్యతముఁడు, నిఖిలలోకైకపూజ్యుఁ డై ♦ నివ్వటిల్లు.

క. ముద మొందవేఁగ నీస్వామికిఁ, గదసి ప్రదక్షిణము భక్తిఁ ♦ గావించుమహా
నవమలతరమానసులకుఁ, బదపదమున నశ్వమేధ ♦ ఫలము లభించున్. 90

తే. భృగుదినంబున నీజగ ♦ ద్విభుని నెవ్వఁ, డవిరళంబుగ నభిషేక ♦ మాచరించు
వాఁడు నిస్తులశాశ్వతై ♦ శ్వర్యధుర్యుఁ, డగుచు ధాత్రితలంబున ♦ నతిశయిల్లు. 91

తే. అవని నెవ్వండు భావనా ♦ రాయణునకుఁ
గుసుమ మాలిక లర్పించుఁ ♦ గోర్కి మీఱ
నతఁ డదభ్రసుఖావహం ♦ బైనయట్టి
దివ్యదేహంబు దాల్చి వ ♦ ర్తించు దివిని. 92

తే. భావనారాయణాహ్వయ ♦ స్వామిమ్రోలఁ
గడఁగి మంగళదీప మే ♦ ఘనుఁడు నిలుపు
నతనిఘోరాఘనిచయంబు ♦ లలికె యుఱుకుఁ
గమలమిత్రోదయమునఁ జీఁ ♦ కటులువ్రాలె. 93

తే. గుడపయోఘృతమిశ్ర మై ♦ గుబులుకొను హ
విష్య మెవ్వాఁడు స్వామి క ♦ ర్పించు భక్తి
వితతముగ నాతఁడు పునరా ♦ వృత్తిరహిత
శాశ్వతబ్రహ్మలోకైక ♦ సౌఖ్య మొందు. 94

క. ఇద్ధరణిధరుప్రసాదము, శుద్ధాత్ముం డగుచు ముదము ♦ సొం పెసలారన్
సిద్ధార్థమాత్ర మెవ్వఁడు, సిద్ధంబుగ మెసఁగు నతఁడు ♦ సిద్ధార్థుఁ డగున్. 95

వ. అని చెప్పి మఱియు నిట్లనియె. 96

సీ. భావనారాయణ ♦ దేవుని సేవింపఁ, దప్పక యేఁటేఁటఁ ♦ దవిలి యేను
నంతసంబున ధను ♦ స్సంక్రమణంబుల, వాణీయుతుండనై ♦ వచ్చుచుందు

మీరను దప్పక ♦ దారసమేతు లై, వాలెంబు నిచటికి ♦ వచ్చుచుండి
యిద్దేవు దర్శించి ♦ యొలమిఁ బ్రదక్షిణ, నతినుతిపూజాభి ♦ రతుల నలరఁ
తే. జేయుచుండుఁడు పూజ్యతఁ ♦ జెంది కడుఁ గృ
తార్థు లయ్యెద రెవ్వఁ డీ ♦ హరికి ధన్య
మానమున నించుక హవిస్స ♦ మర్పణంబు
చేసెనేని యతం డొందు ♦ సిద్ధపదము. 97

తే. ఒనర నుత్తరఫల్గునీ ♦ యుక్తమైన
హరిదినంబున వృషభంబు ♦ నందు నినుఁడు
మలయునప్పుడు వైశాఖ ♦ మాసమునను
రండు మీ రిందు మరలఁ బెం ♦ బండువుగను. 98

సీ. వచ్చి మీ రందఱు ♦ వైశాఖమునఁ దార, సిలి యర్ఘ్యపాద్యాభి ♦ షేచనములఁ
జందనాగరుఘన ♦ సార కాశ్మీరక, ధ్రవధూపదీపనీ ♦ రాజనముల
మందార కేతకీ ♦ మల్లికా చంపక, నవతులసీదళ ♦ నివహములను
బనస రసాల రం ♦ భా నారికేళ ఖ, ర్జూరకాదికఫల ♦ స్తోమములను
తే. భక్తి దైవాఱఁ బానీయ ♦ భక్ష్యభోజ్య, లేహ్యచోష్యాదికముల నా ♦ లోకనేత్రు
భావనారాయణునిమహా♦ప్రభునిఁదృప్తిఁ,జేసి తత్కృప వడయుఁడీ♦ప్సితము లొదవు.

తే. భావనారాయణార్పిత ♦ పావనప్రి, సాదములు గొని చనుఁడు మీ ♦ స్థానములకు
నివ్విభునయజ్ఞ వడసి యేఁ ♦ టేఁట నిట్లు, వచ్చుచుండుఁడు నియమంబు ♦ వాటిలంగ.

తే. భావనారాయణుని మహా ♦ ప్రభుని నీకు, భూసురం బగు వైశాఖ ♦ మాసమునను
గనుచుఁ బొగడుచు నుతుల న♦ ర్చనల నిడుచు, జనుఁ డభీష్టఫలంబుల ♦ నెనయుఁ జెండీ.

వ. అని తెలుపుచున్న యప్పద్మసంభవునకు దివిజమహర్షి పుంగవు లిట్లని విన్నవించిరి. 102

సీ. అఖిలాండనాయక ♦ యబ్జగర్భ సమస్త, నిర్జరనాథ వా ♦ ణీసహాయ
భావనారాయణ ♦ దేవుని సేవించి, సంతుష్టఁ జేయ మే ♦ మెంతవార
మీవె సమర్థుఁడ ♦ వీక్షణధ్యానన,న్నుతిపర్యాసమ ♦ స్కృతులయందు
నైన నీయాజ్ఞ గా ♦ దనక ప్రత్యబ్దంబు, వాలెంబు నిచటికి ♦ వచ్చిదేవ
తే. దేవు బ్రహ్మాండనాయకు ♦ దివిజవంద్యు, నిందిరాధీశు సనకస ♦ నందనాది
పరమమునిగేయు బుధజన♦భాగధేయుఁ,గరము భజియించెదము భక్త♦వరద యనఘ.

వ. మఱియు నత్ఫుల్లగండస్థలయుగళుండును బుండరీకదళాయతేక్షణుండును దరస్మిత
చంద్రికాలికాసాహసహాసితకలంపాంధకారుండును శంఖచక్రగదాధయుప్రిదర్శకభుజో

జ్జ్వలుండును దమునమ్యుండును శ్రీవత్సకౌస్తుభాంభోధితనయావాసితనుమధ్యుండును జగ
జ్జనధరుండును లీలాకౌశేయవాసుండును శారదాంభోజనీకాశపదద్వయరాజితుండును
సర్వప్రభుండును నగు శ్రీమద్భావనారాయణమహాప్రభుసేవార్థంబు కళత్రబాంధవప్రా
పేతుల నై ధనుర్మాసవైశాఖమాసంబుల నీవెంబడి వచ్చుచుండెద మని విన్నవించు
చున్నసమయంబున శంభుండు భావనారాయణస్వామి నిట్లని వినుతించె. 104

## శంభుఁడు భావనారాయణస్వామిని నుతించుట.

తే. మహియును సలిలంబుఁ దేజంబు ♦ మారుతాభ్ర
ములు మనోబుద్ధ్యహంకార ♦ ములును భిన్న
పరము లయ్యు నభిన్నతఁ ♦ బరఁగి యేమ
హామహునిరూప మయ్యె న ♦ య్యనఘుఁ గొలుతు. 105

వ. మఱియు నాబ్రహ్మస్తంబపర్యంతంబు స్థావరజంగమాత్మకం బగుజగం బెవ్వనిలీలాపరి
కరం బట్టినీకు నమస్కారంబు సేసెదను చతుర్ముఖసోమసూర్యపురందరాదిసమస్తదేవత
లెవ్వనితనుభూతంబుల మైరి యట్టినీకు నమస్కారం బీశ్వరత్వాభిమానుల మగు
మముబోంట్లఁ బ్రతిబోధించుటకై నారదునకు స్త్రీత్వంబును బురుషసంసర్గంబును బుత్త్ర
శతోదయంబును దత్పంచత్వంబున నత్యంతదుఃఖంబును గల్పించి క్షణమాత్రంబునఁ
గ్రమ్మఱ మహర్షిం జేసి పరతంత్రుండ వై పరఁగుచున్న నీమహత్త్వంబు దెలియ నెవ్వం
డర్హుండు నీవు నాకు నిట్టినిశ్చలబుద్ధి యొసంగు మని ప్రార్థించుచున్నసమయంబున
నారదుండు హరి కిట్లనియె. 106

## నారదుండు హరిని వేఁడుకొనుట.

తే. భావనారాయణ కృపాబ్ధి ♦ దేవదేవ, నిఖిలలోకశరణ్య నే ♦ నిన్ను శరణు
నందుదు నసారతంబు నా ♦ యందుఁ గలుగు, వత్సలత నిందు నీ వుండ ♦ వలయుఁ జుమ్మి.

సీ. పూజ్యమానసు లైన ♦ పురుషులచేత నా, రాధ్యమానుండ వై ♦ రహిని వారొ
సంగుతత్తత్కాల ♦ సముచితారాధనం, బులఁ దృప్తిఁ బొందుచు ♦ నలర వారి
కీప్సితార్థఫలంబు ♦ లిడుచు శ్రీదేవియు, భూదేవి నీళయు ♦ భుజగవిభుఁడుఁ
బతగేంద్ర సేనేశ ♦ పరివారములుఁ గొల్వ, వైకుంఠమున నుండు ♦ వల నెసంగఁ

తే. చిరతరంబుగ నిమ్మహా ♦ క్షేత్రమున వ, సించి యాశ్రితజనుల ర ♦ క్షించుచుండు
సర్వపురవాస భువనర ♦ క్షణవిలాస, భావనారాయణ మహాను ♦ భావ దేవ. 108

క. మంగళము నీకు శ్రితజన, మంగళదాయక మునీంద్ర ♦ మానసవిలస
ద్భృంగాయమానవిగ్రహ, మంగళ మఖిలాండకోటి ♦ మహితపిచండా. 109

సీ. మఙ్గళ మస్తు ర ♦ మాముఖాబ్జపతఙ్గ, మఙ్గళ మస్తు భు ♦ జఙ్గశయన
మఙ్గళ మస్తు సా ♦ మజరాజపరిపాల, మఙ్గళ మస్తు వి ♦ హఙ్గగమన
మఙ్గళ మస్తు మ ♦ న్మథసున్దరాకార, మఙ్గళ మస్తు క ♦ ల్మషవిభఙ్గ
మఙ్గళ మస్తు కో ♦ మలదివ్యవిగ్రహ, మఙ్గళ మస్తు ర ♦ థాఙ్గహస్త.
తే. మఙ్గళం తే కమలజాణ్డ ♦ మహితజఠర, సర్వపురవాస భక్తర ♦ క్షణవిలాస
భావనారాయణప్రభు ♦ వర సమస్త, మఙ్గళాని భవన్తు తే ♦ మదనజనక. 110

ఉ. మంగళ మిందిరావిమల ♦ మానసపద్మవరోరుహాళికిన్
మంగ మాశ్రితావన ♦ మగ్రకళావిలసద్గుణాళికిన్
మంగళ మగ్రదానవత ♦ మస్సముదాయకరాళహేళికిన్
మంగళ మండజప్రవర ♦ మంజులపాలికి దేవమౌళికిన్. 111

వ. అని యనేకప్రకారంబులం బ్రార్థించుచున్న నారదమునీంద్రునకు భగవంతుండు మేఘ
గంభీరవాక్యంబుల నిట్లనియె. 112

## భగవంతుండు నారదునియెడఁ బ్రీతుఁ డగుట.

సీ. నారద యిందు ర ♦ మారమణీ భూప్రభూ నీళలను జేర్చి ♦ తోడఁ గూడి
మానితచ్ఛత్రచా ♦ మరహారంబు లగుదివ్య, సూరిజనుల్ గొల్వ ♦ సుభగలీల
నాశ్రితావళి కీప్సి ♦ తార్థము లొసఁగుచు, నరువైభవంబున ♦ నుందువాఁడ
భువి మదీయక్షేత్ర ♦ ములు నూటయెన్మిది, గల వందు సర్వస ♦ గరమహాప్ర
తే. భావ మెంతయు నధికమై ♦ పరఁగు దీని, యైదుకోనల నుందుచ ♦ రాచరములం
మత్స్యరూపంబులఁ నిజంబు ♦ మది నెఱుంగు, వినుతగుణగణ్య నారద ♦ మునివరేణ్య.
ఆ. మూఁడుదినము లిందు ♦ ముద మొప్ప నెవ్వాఁడు, నిలిచియుండు భక్తి ♦ నివ్వటిల్ల
నజ్జనుండు శతస ♦ హస్రాశ్వమేధఫ, లంబుఁ జెందు నిశ్చ ♦ యంబుగాఁగ. 114

క. జనుఁ డీక్షేత్రము దర్శిం, చినఁ బుణ్యం బొదవుఁ బ్రీతిఁ ♦ జేసినఘనపు
ణ్యున కపవర్గము కరతల, మునకున్ వచ్చును నిజంబు ♦ మునివరతిలకా. 115

క. నరుఁ డంత్యమునందుఁ గళే, బర మిచ్చట విడిచె నేని ♦ భవముక్తుం డై
పరమపదప్రాప్తుం డగు, పరియొదవనికీవి నార్య ♦ జనులు నుతింపన్. 116

## గ్రంథ ఫలాదిస్తుతి.

వ. అని యిట్లు భగవంతుండు నారదునకుం జెప్పి దివిజర్షివరులకు యథాస్థానంబులకుం బోవ
నాజ్ఞ యొసంగిన నంత బ్రహ్మాదిదేవతలును నారదాదిమహర్షులును భావనారాయణ

స్వామికి నమస్కారంబు లొనంగి చనిరి ముక్తికాసారనీరంబుల మునింగి భావనారాయణదేవుని దర్శించినవరుండు శుభసంతతులఁ బొంది పునర్జన్మరహితుం డగు నీక్షేత్రమాహాత్మ్యంబు వినిన వినిపించినఁ బఠించిన లిఖించిన సజ్జనుండు విష్ణులోకప్రాప్తుం డగు నని కుంభసంభవుండు శౌనకునకుం జెప్పిన విని వసిష్ఠుం డంబరీషున కెఱింగించిన నతం డత్యంతసంతుష్టాంతరంగుం డయ్యె. 117

సీ. వల నొప్ప బ్రహ్మకై ♦ వర్తపురాణోక్త, మై సర్పనగరమా ♦ హాత్మ్య మలరు
నది యేను శాలివా ♦ హనశకాబ్దంబులు, పాటింప వేయునా ♦ ర్నూటడెబ్బ
దా యగుభావమ ♦ హావత్సరంబున, భావనారాయణ ♦ దేవ దేవు
నానతివలన ని ♦ ట్లాంధ్రిం బొనర్చి యా, స్వామికి దేవతా ♦ చక్రవర్తి
తే. కర్పణం బొనరించితి ♦ నధికభక్తి, నిమ్మహాపుణ్యచారిత్ర ♦ మిద్ధరిత్రి
నాసుధాకరతారార్క ♦ మగుచు సజ్జ, నోత్తములయింట్ల నేప్రొద్దు ♦ నుండుఁగాత.

చ. పరమకృపాలవాల నిజ ♦ భక్తజనావనశీల యోగిహృ
త్సరసనరోమరాళ దివి ♦ షన్మునిసంస్తుతిలోల దీనమం
దిరసురసాల సుప్రథిత ♦ నిర్మలకీర్తివిశాల యక్ష కి
న్నర నర సాధ్య ముఖ్యసుమ ♦ నస్సముదాయనితాంతపాలనా. 119

క. అక్షుద్రభుజపరాక్రమ, శిక్షితదైతేయ నిఖిల ♦ శిష్టవిధేయా
చక్షుగిశర్ణకదంబా, ధ్యక్షాంగశయాన బుధవి ♦ తానవిధానా. 120

తరలము. దర సుదర్శన శార్ఙ్గ నందక ♦ ధారణా శుభకారణా
హరిహయప్రముఖాఖిలత్రిద ♦ శావనా మునిపావనా
సురవిరోధివరూథినీపరి ♦ శోషణా నతపోషణా
వరశకుంతకులాధినాయక ♦ వాహనా నవమోహనా. 121

గద్యము. ఇది శ్రీమత్కుక్కుటేశ్వరకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితా
సామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి
గంగనామాత్యపుత్త్ర సకలసంస్కృతాంధ్రలక్షణకళా కౌశలాభిరామ
తిమ్మకవిసార్వభౌమప్రణీతం బైనసర్పపురక్షేత్రమాహాత్మ్యం
బనుపుణ్యచరిత్రంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము.



శ్రీశారదాम्बాయై నమః,

# నీలాసుందరీపరిణయము.



అచ్చతెనుఁగుగబ్బము

## ప్రథమాశ్వాసము.



లకుఁ దావకం బగుచుఁ • జెన్నలరారెడు వెండికొండపై
మేలికడానిడాల్ పొలయు • మీఱెడుజాబిలిఱాలమేడలో
వేలుపుఱేఁడు నల్వయును • వెన్నుఁడుఁ గొల్వఁగ మంచుఁగొండరా
చూలిని గూడి వేడుకలఁ • జొక్కెడు రేనెలతాల్పుఁ గొల్చెదన్.

### ఇష్టదేవతాదిప్రార్థనము.

సీ. అలరుఁ బెంగడిమితోఁ • టల నాడుపూఁబోఁడి, పూవవెన్నెల ఱేనిఁ • బూనుచాన
కోరి యేనుఁగుమోముఁ • గొడుకుఁ గాంచినతల్లి, చిలువతాలుపువేల్పు • వలపుటింతి
తెలిబొబ్బమెకపుమే • త్రేఁజెక్కుడిదంట, చెదుగురక్కసియూఁకఁ • జిదుముదిట్ట
తొలుపల్కుగిల్కుటం • చెలు గలయొలనాఁగ, యెల్లమేల్బంకి నై • యెనఁగుచాన
తే. యొనరఁ జెఱగంటి తెఱవల • యుడిగములకు,నడరి యుడిపొనిబలునెర • లిడెడునట్టి
గట్టుదొరపట్టి యొనలేని • కనికరమునఁ, బొదలుచును మమ్ము ననయంబుఁ • బ్రోచుఁగాత.

సీ. కొఱమాలి వినమిక్క • కఱకురక్కసిఁ జెండి, పఱపుమీఁ జెనుబండి • విఱుగఁ ద్రొక్కి
వెఱఁ గొప్ప ద్రేతల • మొఱఁగి వెన్నలు మెక్కి, తతి నూచి మద్దులు • పెఱికి వైచి
యుఱ చేతఁ గొండఁ జా • పఱు వొగడఁగఁ బూని, నెరిగిబ్బతొలు వేల్పు • మురియడంచి
చిఱుతపాయపుగొల్ల • తెఱవల వలపించి, మఱవక పసులఁ బ • ల్మఱును గాచి
తే. వెఱ పెఱుంగక మదువప • నఱికి కడిమి, మొఱయుఁ దక్కరివిసదారి • చిఱునుఁ దఱిమి
మఱియుఁ బే రగుతులువల • నుఱుము సేసి, వఱలు కఱివేల్పు నెద నెంతు • గుఱి దలిర్ప.

ఉ. కమ్మని తెమ్మ దెమ్మెరలు ♦ గ్రమ్మఁగ నిమ్మగు తమ్మిమేడలోఁ
దమ్మిదకొమ్మ లెమ్మెలను ♦ దూకొని నీటుగఁ బాటఁ బాడఁగాఁ
గొమ్మని పూవుఁదేనియలఁ ♦ గూరిమి నామెత లిచ్చి నిచ్చలున్
నెమ్మది నందుపాల్కడలి ♦ నెయ్యపుఁగూఁతురు మమ్ముఁ బ్రోచుతన్. 4

క. తద్దయుఁ బొగడెద వేలుపుఁ, బెద్ద యనన్ జగములెల్లఁ ♦ బెంచుచుఁ బల్కు
ముద్దియతో నెఱతామర, గద్దియఁ గొలువుండునల్మొ ♦ గంబులప్రోడన్. 5

చ. బలుతెలిపుల్గువారువము ♦ బంగరుపీణెయు మిన్కుటందెలుం
జిలుకతుటారిబోటియును ♦ జిందపువన్నియమేనుఁ బొత్తముం
జెలువపుఁదెల్లదమ్మివిరి ♦ సింగపుగద్దెయుఁ గల్గి యొప్పు న
ప్పలుకులచాన జా నలరు ♦ పల్కు లొసంగెడుఁ గాత నిచ్చలున్ 6

ఉ. మ్రొక్కు లొనర్తుఁ గేలుఁగవ ♦ మోడిచి చొక్కపుఁగొక్కుఁజెక్కుపై
నెక్కెడుబల్వజీరునకు ♦ నిమ్ముగ నమ్మినవారి మేల్పనుల్
చక్కఁగఁ జేయుదేవరకుఁ ♦ జక్కెర కొబ్బెరపండు లుండ్రముల్
మెక్కెడుపాఁపజందెముల ♦ మేటికి బత్తిని మాటిమాటికిన్. 7

ఆ. పుట్టఁ బుట్టినట్టి ♦ దిట్టయు దీవిని, బొడమినట్టిపున్నె ♦ ములగనియును
మొదలుగాఁగఁ గబ్బ ♦ ములు వేల్పుబాసను, గూర్చినట్టివారిఁ ♦ గోరి తలఁతు. 8

ఉ. మున్ను దెనుంగుఁ గబ్బములు ♦ ముజ్జగముల్ పొగడంగఁ గూర్చి పే
రెన్నికఁ గన్న బల్లిదుల ♦ నిమ్మగు డెందపుఁదమ్మిలోపలం
బన్నుగ నిల్పి నిచ్చలును ♦ బాయక కూరిమితోఁ దలంచెదన్
నన్నయభట్టుఁ దిక్కనను ♦ నాచనసోముని నెఱ్ఱప్రెగ్గడన్. 9

క. ఎదఁ గుదురగు బత్తిని గొ, ల్చెదఁ బలుపుట్టువులఁ గూరి ♦ చినదోసంబుల్
చిదుమంగా వేడుక పె, ల్లిద మొదవెడు డెందులూరి ♦ లింగయగురునిన్. 10

ఆ. అనుచు నెల్లవేల్పు ♦ లను గొల్చి మును కబ్బ, ములను గన్నగాఁ ♦ కవులను దలఁచి
గురుని బత్తి నెంచి ♦ కోరి యచ్చతెనుంగుఁ, గబ్బ మే నొనర్పఁ ♦ గడఁగుతఱిని 11

కవి కైనస్వప్నంబువృత్తాంతము.

సీ. ఏవేల్పు గుడిదాల్పు ♦ తీవంచమోముల, తలువల బల్ప్రోవు ♦ దొలఁగ మీటె
నేసామి సామేన ♦ నేపారిద్దుపలిగట్టు, దొరపట్టి నర్మిలి ♦ తోడఁ బూనె

నేకోఁడు పసిమీఱ ♦ నీకేడుజగములఁ, బ్రోడయై యునయంబుఁ ♦ బోఁవ శూల
నేరాయఁ డెనలేని ♦ గారావు టూడెంపు, జడదారులకు మ్రొత్తి ♦ వడి సెంపంగ
తే. మన్ను గేస్తుఁడు నగ్గియు ♦ మిన్ను నీరుఁ, బొద్దుసెలగాడ్పు లెవ్వాని ♦ రూపు లయ్యె
నట్టితెలిగట్టు మన్కిపు ♦ డైనదిట్ట, యొఱపు రాణింపఁ గలలోన ♦ నెక్కునాఁడు. 12

సీ. పసిదిండి మెకపుర ♦ క్కపితోలు మొలఁ జుట్టి, కేల ముమ్మొనవాలు ♦ గీలుకొలిపి
చిన్ని వెన్నెల కొలి ♦ సికపువ్వుగాఁ బూని, పెనుఁజంక నెకజింక ♦ పిల్ల నిలిపి
జడలలోఁ దెలినీటి ♦ చదలేటిజాల్మాఁటి, జాసెంద వెలిబూది ♦ మేన నలఁది
తోరంపుఁజిల్వరా ♦ తోడవు లిమ్ముగఁ దాల్చి, యెదఁ బున్కపరములు ♦ కుదురుపఱిచి
తే. మోముఁదమ్మిని జిఱునవ్వు ♦ మొలకలెత్త, గుబ్బలుల కేనిగారాపుఁ ♦ గూఁతుతోడ
నుక్కు మిగిలిన బలుగిబ్బ ♦ నెక్కి, కొమరు దళుకొత్త మోల్కఁగ ♦ న్గొనఁగ నయ్యె.

క. అటువలెఁ గనఁబడి యెద మి, క్కుటమగు నక్కటిక నొదవ ♦ గుబ్బలిదొరయి
ల్లటపల్లుఁడు నమఁ గన్గొని, దిటముగ నవు డిట్టు లనుచుఁ ♦ దెలియం బలికెన్. 14

సీ. నీతండ్రి గంగన ♦ నివ్వ నివ్వలు మమ్ముఁ, బూజించె నపరంజి ♦ పూలచేత
నీతల్లి లచ్చమ ♦ నే నంతసిలఁగ నో, ములు నోఁచెఁ బుడమివే ♦ ల్పులకు నెల్ల
నీపినతండ్రు లె ♦ న్నికలు గాంచిరి జగ్గ, నయు పింగనయు నర్స ♦ నయును మిగిలి
నీతమ్ము లెలమి నెం ♦ దించిరి మమ్ము సిం, గనయు సూరనయు జ ♦ గ్గనయుఁ జెలఁగి
తే. నీయనుఁగురాణి బుచ్చమ ♦ నెలఁత లెల్ల, మే లనఁ దవర్చి గట్టురా ♦ చూలిఁ గొలిచి
మానికంబవుగద కూచి ♦ మంచికొలము, నందరయఁ దిమ్మకవిరాయ ♦ యలర నీవు.

మ. మును కబ్బంబులనెల్లఁ జెప్పి యెలమిం ♦ బొల్పొందుచు న్నాకు న
ప్పనముల్ చేసినపోడిమి విపుడు గూ ♦ ర్పం బూను నీయచ్చపుం
దెనుఁగుంగబ్బము నిమ్ము నిచ్చలపుబ ♦ త్తి న్మత్తియుఁ బత్తియున్
నెన రొప్ప న్మకూర్పు చెప్పుడును నే ♦ నీయొద్దనే యుండెదన్. 16

క. అని నుడువుచు నద్దేవర, కనుమొఱఁగిన నపుడు మేలు ♦ కాంచి యెదను బా
యనివేడ్క లొదవ నతనికిఁ, బని యొనరఁగ మ్రొక్కు లొనఁగి ♦ బత్తి దలిర్పన్.

షష్ఠ్యంతములు.

క. లిబ్బులదొరచెలికానికి, గుబ్బలియెకిమీనితునుఁగుఁ ♦ గూఁతుమగనికిన్
బెబ్బులిరేడిప్పితోల్, ల్బొబ్బినతమిఁ గప్పుకొన్న ♦ బలువేల్పునకున్. 18

క. చుఱుకు గలయొక్క కోలను, గుఱిగాఁ దిగ ప్రోల్లు నేలఁ ♦ గూలిచి కడిమిన్
మెఱయుచు జేజేగములకుఁ, దఱుఁగనిమే లిడినగిబ్బ ♦ తత్తడిదారకున్. 19

క. తలఁచుని రాబారులచి, క్కులు దొలఁగఁగఁజేసి మనుచు ♦ గొనములగనికిం
దులుఫతొలువేల్పుఁగూటువ, బలితపుఁబెన్మొగులుఁజాలుఁ ♦ బయ్యెరకుఁ దగన్,

క. నెలతాలఁ బోలునిద్దపుఁ, దెలిడాల్గలమేనిమేటి ♦ దేవర కెపుడుం
గొలిచినబంటులకోర్కులు, పొలు పొదవఁగఁ బిదుకు వేలు ♦ పున్మెదవునకున్. 21

క. పితరదొర కేటత్రాటన్, జతనంబునఁ దివియ మిగుల ♦ జడుపున నెదలో
వెత కుడుచుతపసిబిడ్డని, బ్రతికించి యనంబు గన్న ♦ బల్లిదున కొగిన్. 22

తే. అప్పనంబుగ నెలమితో ♦ నచ్చతెనుఁగు, బానచే నిప్పుడే నొన ♦ ర్పఁగఁ దొడఁగిన
నీల యనుపేరఁ దేజొన ♦ నివ్వటిల్లు, నింతిపెండిలికత తెఱఁ ♦ గెట్టు లనిన. 23

## కథాప్రస్తావన.

క. మును నైమిశ మనునడవిని, మొనసి నిరాబారిసింగ ♦ ములు పెక్కు కతల్
వినుచుండి రోమహర్షణు, ననుఁగుంగొడుకునకు నిట్టు ♦ లని రింపొదవన్. 24

క. జడదారిరాయ మాకుం, గడునెలమిగ లచ్చిమగని ♦ కత యొక్కటి యే
ర్పడఁ దెల్పు మనుచు వేఁడినఁ, దొడరి యతం డపుడు వారి ♦ తో నిట్లనియెన్. 25

## మిథిలవర్ణనము.

తే. వినుఁడు బల్లిదులార మీ ♦ వీను లలర, నిచ్చలంబుగఁ దెల్పెద ♦ దచ్చికడల
నెన్నఁదగి వన్నియల కెల్ల ♦ నిక్కయగుచుఁ, బుడమిలోపల మిథిలనాఁ ♦ బ్రోలు వెలయు.

సీ. వెలలేనివలుఁదక్రొ ♦ న్నెలతాలమాడువు, లద్దంపుఁదరఁగమొ ♦ త్తములు గాఁగ
రంగుబంగరువుమె ♦ ఱుంగుటరంగులు, నిద్దంపుటీనుకతి ♦ న్నియలు గాఁగఁ
గులుకుఁబాయపురాచ ♦ తలిరాకుఁబోఁడులు, పగడంపుఁదీవజొం ♦ పములు గాఁగ
మేటిపఁగ్గొమ్ముల ♦ మెకపురాతుటుములు, బలితంపుఁబఱపుగు ♦ బ్బలులు గాఁగ
తే. వన్నియలుమీఱిచెలువారు ♦ వారువములు, కొమరుదలుకొత్తుబలుమాని ♦ కములు గాఁగఁ
బొంకముగనెల్లసిరులకుఁ ♦ డెంకి యగుచుఁ, బాలమున్నీటిపగిది నా ♦ ప్రోలు దనరు.

ఉ. పున్నమచందురుం దెగడు ♦ పొంకపుమోములరాచకన్నియల్
గ్రొన్నెలతాలమేలిపని ♦ కొప్రపుమేడల నాటలాడ నా

యున్నలకుల్కలేనగవు ♦ లచ్చపువెన్నెల లంచుఁ ద్రిమ్మరున్
వెన్నెలపుల్గుమొత్తములు ♦ వేడుక నబ్బలుపీట మాటికిన్. 28

చ. మినుకుఁగడానిబంగరువు ♦ మేడలసోరణగండ్లవెంట రేల్
చనియెడిరిక్కమొత్తమును ♦ జక్కఁగఁ జూచి మెఱుంగుఁబోఁడు లి
చ్చను బిడికిళ్లఁ బట్టి యవి ♦ జాతి చనం దమగోళ్ల చుక్కలం
చును నెడ నిల్చి చే వదలి ♦ చూచుచు నుబ్బరపోదు రందులన్. 29

చ. పగడపుఁగంబముల్ నిలిపి ♦ పన్నినముత్యపుఁజప్పరంబులన్
నిగనిగ లాడుకుందనపు ♦ నిద్దపుగోడల నాఁడెమైనమ
త్తిగరతనంపుజల్గుఁబని ♦ తిన్నియలున్ బలుదమ్మికెంపుటా
జిగితలుపు ల్గడు న్మెఱయుఁ ♦ జెన్ను దలిర్పఁగఁ బ్రోల నెల్లెడన్. 30

తే. ఇగురుఁబోండ్ల కగత్తలో ♦ నీఁదుచిలుక, చెలువ లిడుతమ్మికెంపులుఁ ♦ జెలఁగికోట
కొమ్మలం దాడుతెఱగంటి ♦ కొమ్మ లిడెదు, వేల్పుదొరమానికములు న ♦ వ్వీటఁ దనరు.

తే. ప్రోలిపగ్గోటకొమ్మలఁ ♦ బులుఁగుటాలు, గఱిక యని డాని చెంతఁ జై ♦ క్కడపుసింగ
ములను గన్గొని వడుచక్కిఁ ♦ బోవ వెఱచి, ప్రొద్దుతేజీలు బలువడిఁ ♦ బోవుఁ గడల, 32

క. పన్నుగ నందలియేనుఁగు, గున్నలపై మావటీంద్రు ♦ కోరిక లడరన్
మిన్నేటిపసిఁడితామర, క్రొన్ననలను వన్నె మీఱఁ ♦ గోయుదు రెపుడున్. 33

తే. పొడుపుమలనుండి పడమటి ♦ కడలి కరుగఁ, బవలునలుజాములునుబట్టుఁ ♦ దొవలనూడు
తత్తడుల కని మాటలో ♦ దచ్చికడలఁ, బఱచి క్రమ్మఱు నచటిబా ♦ టాతుటుములు.

క. నలుమొగములఁ దా నాలుగు, తొలుపలుకులు చదువు టేమి ♦ దొడ్డని నలువం
బలికి కలచదువు లెల్లను, బలుకుదు రొక్కొక్కనోరఁ ♦ బాఱులు వీటన్. 35

చ. కలన నెదిర్చి వేనిఁ దిగ ♦ కన్నులవేలుపు నైన మార్కొనం
దలఁపుదు రెద్ది వేఁడిన ని ♦ దం గని మానక జన్నిగట్టుఁబె
ద్దలకును వేదసాదులకుఁ ♦ దద్దయు నిత్తురు ప్రోల నెప్పుడుం
బొలుపు దలిర్ప రేవెలుఁగు ♦ ప్రొద్దుకొలంబులరాచసింగముల్. 36

ఆ. తోలుదాల్పువనుఁగు ♦ తొమ్మిదిపాఁతఱల్, రొక్క మున్న దనుచు ♦ నిక్కఁగాని
లెక్క కెక్కు డైన ♦ రొక్కంబుఁ దఱుఁగని, కొలుచుఁ గలదు ప్రోలి ♦ కోమటులకు

తరలము. మొలకఁ జెల్లనిబట్ట లేకయు ♦ ముచ్చటం గలు ద్రావుచుం
బొలము దున్నఁగ నోడి నాఁగలి ♦ పూని త్రిమ్మరు నంచు ని
చ్చలును బల్కుచు నుందు రాకటి ♦ సామియన్నను దట్టపుం
గలుముల న్వాలుఁగొంది యచ్చటి ♦ కాఁపుఁబెద్దలు తద్దయున్. 38

చ. కలుకమిటారిగుబ్బలును ♦ గ్రొమ్ముడులు న్నిగిగొనలుం బిఱుం
దులుఁ గదలంగఁ జెల్కలను ♦ దోలు నెపంబున నెల్గ లెత్తి గా
జాలు గలుగల్లనం జాఱుకుఁ ♦ జూపులచేఁ దెరువర్లఁ డెందముల్
గలఁపుదు రందులం బొలము ♦ కాపరికాఁపుఁదుటారికత్తియల్. 39

చ. పగడపుఁదీఁగఁలో తళుకు ♦ బంగరుబొమ్మలొ క్రొమ్మెఱుంగులో
తొగచెలితున్కలో మరుని ♦ తూపులొ బల్ రతనంపుఁదేటలో
సొగసులదీవులో యనుచుఁ ♦ జూపఱు లువ్విళు లూర నందులం
బొగడికఁ జెంది యందములఁ ♦ బొల్తురు నీటుగ నాటచేడియల్. 40

## ధర్ముఁ డనుజేనివర్ణనము.

క. అప్పి డేలు క్ష్మే లని, దవ్వులదొర లెన్న మిగుల ♦ ధర్ముఁడు దనతోఁ
జివ్వకు నెదురై నిలిచిన, ముప్వురువేలుపుల నైన ♦ మొనసి కలంచున్. 41

సీ. వెడవింటిబలుదంటఁ ♦ బొడసూపఁగా నీక, తోలుదాలుపు నొక్క ♦ మూల కనిచి
తోలుమొగుల్తుటుముల ♦ దూదియ ట్లవియించి, కలువలచెలికాని ♦ వెలి యొనర్చి
గాలిమేఁతరితేనిఁ ♦ గా లానఁగా నీక, కపిలి నెల్లప్పుడు ♦ నడలఁజేసి
వెడఁదమోము మెకంబు ♦ నడవుల డాఁగించి, గట్టులయొకిమీనిఁ ♦ గడకుఁ ద్రోచి
తే. చక్కఁదనమున వాసిని ♦ జాగమునను, జిగిని మాటల లోఁతున ♦ మగతనమున
నిచ్చలంబునఁ గడలఁ దా ♦ నెచ్చుగాంచి, పొగడికలఁజెందు నెపుడున ♦ ప్పాడమిఱేఁడు.

సీ. ఎనలేనిమగఁటిమి ♦ నెనఁగువాఁ డగుటకుఁ, బొం చుండి కోఁతిని ♦ ద్రుంచఁ డేని
కోర్కు లెల్లను సమ ♦ కూర్చువాఁ డగుట కూ, రక చుప్పనాక మ ♦ రల్పఁ డేని
కనికరంబుల కెల్ల ♦ నునికిప ట్టగుటకుఁ, బొలదిండ్లఁ బొలియింపఁ ♦ దలఁపఁ డేని
యుడివోనికలుముల ♦ నడరు చుండుటకుఁ గా, ఱడవుల దుంపలు ♦ గుడువఁ డేని
తే. బంతితేరులపంటవ ♦ లంతితేని, కొడుకు దొర యగు నతనికిఁ ♦ గడిమి నీగిఁ
గనికరంబున సిరి సంచుఁ ♦ గడఁగి పెద్ద, లెన్న నారాచజాబిలి ♦ చెన్నుమీఱు. 43

క. పిఱికితనంబున జలమును, గొఱకొఱ యీలేనిగోనము ♦ గుఱి దప్పటయును
దుఱుతున బిగియును గల్లయు, నెఱుఁగఁ దలం డించు కయిన ♦ నెల్లెదలందున్.

సీ. జగడంపుటోరంపు ♦ జడదారి కద కేఁగి, చదలేటితెలినీట ♦ జలక మాడి
తెఱగంటిదొరయింటి ♦ తెలిమ్రాఁకు లెగఁ బ్రాఁకి, వల నొప్పఁ గలిదీవి ♦ కెలవ నెలఁగి
పలుచందములఁ జింద ♦ ములఁ గ్రిందుపడఁ జేసి, నెలతొల్పు బలువేల్పు ♦ నెలవు వన్నె
చల మూని యలరేనుఁ ♦ గులనూడు దిగవాడి, మగఱాలఱిగి నెలఁ ♦ దగుచుఁ బొగడి
తే. ముత్తియంబుల నురువుల ♦ మొల్లవిరుల, మంచుసోనలఁ జొక్కులి ♦ వంచుగముల
నెంచి కొంచక తనయసం ♦ బెల్లకడల, వెలుఁగ వెలుఁగొందు నారాచ ♦ వేల్పు లేఁడు.

క. వెంగలియుఁ బిఱికివాఁడును, దొంగయుఁ గొండీఁడుఁ బేద ♦ తులువయు ననికిన్
లొంగినవాఁడును లేఁ డర, యంగా మందునకు నైన ♦ నద్దొరపురమిన్.                    46



కుంభకుఁ డనుగొల్లదొరకత.

క. ఆరామానిక మెప్పడు, గారవమునఁ బెనుప నందుఁ ♦ గదలనిపిరులం
గేరుచుఁ గుంభకుఁ డనియెడి, పేరిటిగొల్లదొర యొకఁడు ♦ పేర్మిఁ జెలంగున్.                    47

తే. వేలుపుల ఱేఁడు దన కొక ♦ వెల్లమొదవె
గల దనుచు నిక్కు నింతియు ♦ కాని యిట్లు
గలవె పలువన్నియలగిడ్డి ♦ కదుపు లంచు
నెంచుచుండు నతం డెందుఁ ♦ గొంచు లేక.                    48

సీ. అడిగినఁ గాదనక ♦ పుడమివేల్పులకు ని, చ్చలుఁ బాఁడిమొదవులఁ ♦ జాల నొసఁగుఁ
బేదగేస్తులఁ జేరఁ ♦ బిల్చి కోరినయన్ని, దుక్కిటెద్దులఁ బల్మి ♦ తోడ నిచ్చు
మునినల్లఁ గడఁకమై ♦ వెదకి తా రావించి, నెమ్మిఁ గగ్గొని యొగి ♦ రమ్ము వెట్టు
నెడపక గీమున ♦ కేతెంచువిందుల, కెలమి పల్లాలును పా ♦ ములు నొసంగుఁ
తే. జెలిమిఁ గాంచును బెద్దలఁ ♦ గొలుచువారిఁ, గూరిమి దలిర్ప నారెకు ♦ గారవించు
నౌర యురు దగుఁ బుడమిపై ♦ నరసి చూడ, గొల్లయొకిమి వానిదెంపు ♦ గోనము లెల్ల.

తే. చుక్కలను వానచినుకుల ♦ నిక్కువముగ
లెక్క యిడవచ్చుఁ గాని పెం ♦ పెక్కు నెపుడుఁ
బుడమి యీనినతెఱఁగున ♦ నడరునతని
తొడుకులం దెల్లవిగ లెక్క ♦ యిడఁగ రాదు.                    50

క. అమ్మేటిగేస్తునకుఁ గడు, నెమ్మి యొనర్చుచును నిచ్చ • నిచ్చలు బలుపు
న్నెమ్ముల ధర్మ్మద యనియెడు, కొమ్మ దనరు నెల్లమేలి • గొనములప్రోవై. 51

సీ. అనయమ్ముఁ బెఱయిమ్ము • లను ద్రిమ్మరుచు నుండు
చలివెలుంగునకుఁ • జెలియ లెవరొ
పెనుతాఁగ రైయి మ్రోఁగు • చును మొసలకు వేఁగు
నలుమొగంబులవేల్పు • చెలువ దొరయొ
జగమ్ముఁ దగుదొడ్డ • శక్తి రైయి బెదరించు
గట్టుల యొకిమీని • పట్టి జతయొ
పలుకోఁడులకు నూడు • బలియించి పాలియించి
లలిఁ గేరుపంటవ • లంతి సరియొ

తే. యివ్వెలందుక కని తన • యీడుచేడె, లందఱును డెందముల నుబ్బి • యాడుకొనఁగఁ
జెలఁగి నాఁడెపుఁబుడమిజే • జేలగములఁ, బ్రోదిసేయుచు నెపుడు న • ప్పొలఁతి యలరు.

క. ఉడివొనిసిరుల నిటువలెఁ, దడవెడునయ్యాల్మగల్గఁ • దనియింతురు సాం
పడర సిరిదామఁ దనునొక, కొడుకును మఱి నీల యనెడు • కూఁతు రొకర్తున్.

## నీలవర్ణనము.

క. అచ్చిన్నికన్నెపోయిగ, మచ్చెలువుంజిల్వచెల్వ • లందును మఱి య
య్యచ్చరచేడియలందును, నిచ్చలుఁ బరికింపఁ గలుగ • నేర దొకప్డున్. 54

క. చన్నులు జక్కవగిబ్బలు, కన్నులు చెన్నలరునల్ల • కలువలు పిఱుఁదుల్
దిన్నెలు వన్నెలగని య, య్యన్నులతలమానికంబు • నలవియె పొగడన్. 55

సీ. గొన బారునూగారు • కొదమతుమ్మెదబారు, బలుగుబ్బపాలిండ్లు • పసిఁడిగిండ్లు
నునుఁగావిజిగిమోవి • ననతేనియలబావి, దొరమించుమైరంగు • తొల్మెఱుంగు
నాఁడెంపుజపపెంపు • నాఁచుతీవలగుంపు, కలికికన్గవడాలు • గండుమీలు
పొగడొందుమొగ మెందుఁ • దొగలగాదిలివిందు, జిగి లేఁగవునుఁదీవ • మొగులుత్రోవ

తే. తఱులు తరఁగలు చేతులు • తమ్మివిరులు, తొడ లనఁటులు పిక్కలు • దొనలు తళుకుఁ
జెక్కుటద్దంబు లడుగులు • చెంగలువలు, బొమలు సింగిణు లమ్మించుఁ • బోఁడి కరయ.

ఉ. చిందమునందముం దఱుముఁ • జేడియకుత్తుక క్రొత్తకప్రపుం
గందముచందముం దెగడుఁ • గన్నియనెమ్మెయితావిపిండు లేఁ

కెందామవిందువన్నియ ని ♦ సీ యనఁ బైదలి పెన్నెపల్ బళీ
కుందన మెందుమన్ దొరయె ♦ కృష్ణునిగారవుమేనిచాయకున్. 57

క. సెలఁతుకచిలువగవులు వె, న్నెలలం గని నవ్వు లేమ ♦ నిద్దపుఁగులుకుం
బలుకులు చిలుకల నలుకఁగఁ, బలుకుం బలుకుదురు ప్రాలు ♦ బలుమగవాలన్. 58

తే. అట్లు లేజవ్వనమ్ము సో ♦ యగముఁ గల్గి, చెన్ను మీఱుచు నున్నయ ♦ య్యన్నుమిన్నఁ
గాంచి తలిదండ్రు లెంతయు ♦ గారవమున, నుల్లమున నుబ్బుచున్నచో ♦ నొక్కనాఁడు.

## కుంభకునిపాలి కొకబ్రాహ్మణుఁడు వచ్చుట.

సీ. తిగరేక తీర్పడ ♦ దిద్దిననొసలిను, న్నొలిబూదిబొట్టురం ♦ గులు సెలంగ
నరవిఁ జిచ్చఱకంటి ♦ దొరకంటి పేరింటి, పేరులు పేరెదఁ ♦ బెంపు మీఱ
మొలఁ బింజె వట్టి చెం ♦ గులు మాటి కట్టిన, వలిపనీర్కావిడో ♦ వతి సెలంగఁ
బైఁ గప్పుకొన్నపాగాం ♦ బట్టుదుప్పటి మెఱుం, గులు నల్గడలఁ గ్రమ్మ ♦ కొని వెలుంగఁ
తే. బొత్తములు మేల్కుళాయి పల్ ♦ ముత్తియంపుఁ
బోఁగులును జాల జన్నిదం ♦ బులును గొడుగు
గిండి చెంబును గల్గి ముం ♦ గిటికి వచ్చి
నిలిచె వడి నొక్కనాఁడొంపు ♦ నేలవేల్పు. 60

చ. నిలిచినఁ జూచి గొల్లకొర ♦ నిండినబత్తిని గేలు మోడ్చి య
బ్బలియుఁ డొసంగుదీవనలఁ ♦ బల్మఱుఁ గైకొని గొప్పతమ్మికెం
పులు గదియించినట్టిజిగి ♦ పుత్తడిముక్కలిపీఁటమీఁద ని
చ్చలముగ నుంచి పూజ లిడి ♦ చయ్యన నాతనితోడ నిట్లనున్. 61

తే. పుడమిదయ్యమ యెందుండి ♦ వెడలి వచ్చి, యిటకు రాఁగల్గ మేమి మా ♦ కెఱుఁగఁజేయు
మెచ్చుమిముబోఁటిపెద్దలు ♦ వచ్చు టెల్ల, దొడుతోడనె మేలు చే ♦ కూడఁగాదె.

తే. అనుడు నగ్గొల్లతేనిఁ గ ♦ న్గొని కరంబు, సంతసంబున నలరి య ♦ జ్జన్నిగట్టుఁ
గొలముతలమానికము తన ♦ వలఁతితనము, గనఁబడఁగ నిట్టులని తెల్పఁ ♦ గాఁ దొడంగె.

## బ్రాహ్మణుఁడు కృష్ణుని లీలలం దెల్పుట.

క. విను నీకు బావ యగునం, దునిచెంగటనుండి యొమ్మె ♦ తో నీకడకుం
జనుదెంచితి నబ్బల్లిదుఁ, డనుపఁగ మీసేమ మెల్ల ♦ నారయుకొఱకున్. 64

క. కడు నిడుములఁ బడి వారి, ప్పుడు మునుపటి నెలవు వదలి ♦ పోఁకు మిగులఁగం
దొడుకులకు బృంద యనియెడు, నడవికిఁ గాఁపురము వచ్చి ♦ రలజడి మీఱన్. 65

క. మిగులఁ గడగండ్లఁ బడియుం, దెగకయు వారెల్ల నిపుడు ♦ నీమేనల్లుం
డగుకతి వేలుపుకతమున, నెగి మనుజులతోడ నిల్చి ♦ యున్నారుసుమీ. 66

తే. అతఁడు గావించుకర్జంబు ♦ లరయ నెక్కు, మోము గలిగినమానిసి ♦ యేమి దెలుపు
మీఱఁగా నాలు గై దాఱు ♦ నూఱుపదులు, నోళ్లు గలవారికిని బూని ♦ నుడువరాదు.

క. విను సిరిమంతుఁడు కడువేఁ, గున నడరెడుపుడమిపడఁతి ♦ కొఱకును జేజేల్
మును వేఁడుకొనిన మానిసి, తనము గనినవెన్నుఁ డతఁడె ♦ దం బరికింపన్. 68

క. ఆచంద మెల్ల దిటముగ, నీచెవులకుఁ దనివి దీఱ ♦ నే నెఱిఁగింతున్
రాచపను లిపుడె తలఁపం, జూచుకొనక యాలకింపు ♦ స్రుక్కనితెలివిన్. 69

సీ. మును సోఁకుమూఁకల ♦ మోవ నోపక నేల, చేడియ దలఁకి జే ♦ జేలఁ గూడి
చదువులవేలుపు ♦ మొదలు వెన్నునిచెంత, కరిగి చాఁగిలి మ్రొక్కి ♦ నరగ లేచి
యాయన కత్తెఱం ♦ గంతయు నెఱిఁగించి, జియ్య యిప్పని జాగు ♦ సేయఁ బోక
కావింపవే యని ♦ కడు వేఁడుకొనిన న, వ్వేల్పుల కవ్వేల్పు ♦ వెఱపు దీఱ
తే. నిప్పని యొనర్తుఁ బొందు మీ ♦ రింక్ల కనుచు
ననిచి ననిచినకూర్మితో ♦ నపుడు తొగల
యనుఁగుకొలమున వసుదేవుఁ ♦ డనెడుదొరకుఁ
గొమరుఁ డై పుట్టె నెంతయుఁ ♦ గొమరు మిగుల. 70

ఆ. పుట్టి కంసుఁ డనెడు ♦ నట్టిరాకాసుల, ఱేనివలన నూడు ♦ తోనె పూని
నందునింటఁ జేరె ♦ నందునియిల్లుటా, లగుయశోద పాపఁ ♦ డనుచుఁ బెనుప. 71

తే. అత్తెఱంగునఁ బెనుచు చు ♦ న్నంత నెక్కు, యొడను బూతన యనుపేర ♦ నడరుపెరసు
నల్లద్రావుడుఁబసఁతి మ ♦ త్తిల్లి చేరి, విసపుఁబాలిడఁ గని దాని ♦ యుసుఱు గొనియె.

ఆ. దండఁ గొండపోల్కి ♦ నుండువో నెండెడ, దండితనము మీఱ ♦ నండగొనక
పిండిపిండిగాఁగ ♦ రెండుకాళులఁ దాఁచి, దండిబండిపాలను ♦ దిండిఁ జెండె. 73

క. దొరఁకొని తనుఁ బొదివి కడున్, నరగను జదలికిని నెగిని ♦ జనుచేరజపుం
గరువలిబలుతొలుజేజే, నరుదుగ నుదెత్తాల్పుపీటి ♦ కనిచెం గడమిన్,

సీ. బుడుతకల్వలవిందుఁ ♦ బోలు నెన్నొసలిపైఁ, జెలువంపు రారేక ♦ చిందులాడ
మొలఁ బట్టుదిండుపైఁ ♦ జెలు వొందు గంటల, బంగారు మొలత్రాడు ♦ రంగు లీన
నెదఁ గ్రొత్తపులిగోరు ♦ లొదవిన పతకంబు, బలుముత్తియపుసరం ♦ బులుసుబోగలఁ
జేతుల రతనంపు ♦ జిలుఁగుటుంగరములు, మురువులు వెనలేని ♦ మురువు నూప
తే. మెట్టదమ్ముల నందియల్ ♦ బిట్టు మొరయ, దిట్టతనమునఁ జెలరేఁగి ♦ పట్టపగలె
నెట్టుకొని యెల్లవ్రేతల ♦ నట్టులందు, గుట్టు లరయుచు మెలఁగు న ♦ ప్పట్టి మఱియు.

సీ. తలిరుఁబాయపుముద్దుఁ ♦ జెలువలఁ గనుఁగేఁటి, వలరాచపనులకు ♦ వలసి పిలుచుఁ
జల్ల లమ్మఁగఁబోవు ♦ గొల్లకొమ్మల నడ్డు, కొని సిగ్గు లెడలించి ♦ యొనసి కేరు
మగలతో నిదురించు ♦ మగువల మఱపించి, మగచెయ్వు లొనరింప ♦ మదిఁ దలంచు
నారాటమునఁ బొంగి ♦ నీరాటరేవులఁ, గాచి కన్నెల బల్మిఁ ♦ గవయఁ జూచుఁ
తే. జిన్నిపాపలఁ గూడి బ ♦ ల్మున్నరకల, నన్నిగీముల సన్నక ♦ సన్నఁ దూఱి
యున్న మీఁగడ పెరుఁగుపా ♦ లెన్న జున్ను, లన్నియును గొల్లవాను న ♦ వ్వన్నెలాఁడు.

సీ. పెనుమిన్కుఁగొనత్రోవ ♦ లను మెలంగెడుకోఁడు
చెలఁగి వ్రేతలయిండ్ల ♦ మెలఁగుచుండుఁ
గోరి నిరాబారు ♦ లారసి కనలేని
బలియుండు గొల్లలఁ ♦ బాయ కుండుఁ
గడఁగి జన్నపుఁదిండ్లు ♦ దొడరఁ ద్రిమ్మరుప్రోడ
కుఱ్ఱలగమితోడఁ ♦ గూడి యాడుఁ
గలిమిపూఁబోఁడితోఁ ♦ గదిసి కేరెడుమేటి
గొల్లకన్నియలతోఁ ♦ గూడి కేరు
తే. లెక్క లిడరానిరాయంచ ♦ జక్కిజోదు, గ్రుడ్డుఁబనఁటులు నింపారు ♦ గొప్పబొజ్జఁ
బూను పెనుదంట వ్రేపల్లె ♦ లోనఁ గల్గు, జున్ను పెరుఁగులు ముచ్చిలి ♦ జుఱ్ఱుచుండు.

వ. అంత. 78

క. బి ట్టలిగి వ్రేత లాగిఁ దన, రట్టడిచందములఁ దెల్పి ♦ రాయిడి పెట్టం
గట్టలుకఁ దల్లి ఱోలం, గట్టిన వడి నేఁగి మద్ది ♦ కవ పెకలించెన్. 79

ఆ. అట్టియావదులకు ♦ బిట్టు గాసిలి గొల్ల, లెల్ల బృందలోని ♦ కిపుడు సేరి
రండు విసపుమాఁకు ♦ లై యున్నచెదుగురే, ద్రిమ్మరుల నడంచి ♦ తమ్మికంటి. 80

సీ. బంగారుఁదగటుదు • ప్పటి బిగ్గ మొలఁ జుట్టి, కేలఁ జొక్కపుఁబిల్లఁ • గ్రోలు వట్టి
పెంపారుబలుసెమ్మి • పించె మాదలఁ బూని, చెవిని జేఁకటిమ్రాని • చివురు దుఱిమి
సొగసుగా నొసలఁ గ • స్తురిబొట్టు సవరించి, క్రొన్ననసరము ల • క్కున నమర్చి
గురివెందపూసపే • రొరయ సందిటఁ గట్టి, సన్నంపుసెలగోల • చంక నిఱికి
తే. చెలిమికాండ్రను గూడి ని • చ్చలము మీఱఁ
గడఁకతో నాలకదుపులఁ • గాచుకొనుచుఁ
గొమరు దళుకొత్త ననయంబు • జమునపొంత
మెలఁగు నెనలేనిహొయల న • మ్మేటివేల్పు. 81

తే. మరుని రేకొని జేజేల • దొరకొమరునిఁ, బూపసెలతొల్పుచెలిపట్టిఁ • బోలఁజాలు
వానిచెలువంబు నుడువుల • కౌని కైనఁ, బూని దిటముగ వ్రాకువ్వఁ • బోల దెందు.

సీ. తెలిదమ్మిరేకులఁ • దెగడుకన్నులవాఁడు
తొగలనెచ్చెలి నేలు • మొగమువాఁడు
మించునందము మించు • మెఱుఁగుఁజెక్కులవాఁడు
కొదమతేఁటులఁ గేరు • కురులవాఁడు
మెట్టదమ్ములపొల్పు • మెట్టుమెట్టలవాఁడు
తరఁగచాలు నదల్చు • తఱులవాఁడు
వలుఁదచిందము నెగ్గు • వలుకుకుత్తుకవాఁడు
జడలమొకంబుఁ బో • ల్నడుమువాఁడు
తే. మొల్లమొగ్గల నెనయుప • ల్వానలవాఁడు
పొదలుచిగురాకు దొరయుకెం • పెదవివాఁడు
తొలుమొగుల్ వేగ తఱుముమై • చెలువువాఁడు
చెన్నుగలవాఁడు వలకేనిఁ • గన్నవాఁడు. 83

## కుంభకునికనుసన్నచే నీల బ్రాహ్మణునకు మ్రొక్కుట.

క. అని యుత్తేఱఁగునఁ బాఱుఁడు, వినిపించిన గొల్లకేఁడు • వేడ్కలు మదిలో
నన లెత్తఁగఁ దన్రపోలం, గనుపట్టుననుంగుఁబట్టిఁ • గనుఁగొల్పుటయున్. 84

సీ. కొదమతుమ్మెదదిమ్ము • నదలించు ముంగురు, ల్మొనలిపై ముసరి తుం • పెసలుగాయ
జిలుఁగుఁబయ్యెదలోనఁ • దులకించుకొడెచ, న్నొగడలు డాఁగురు • మూఁతలాడ

గొప్పపిఱుందుద్రవేఁ • గునఁ దడఁబడునడల్, గుడుగుడుగుంచ మిం • చదర నాడ
మురిపంపునగవులం • ముద్దులేఁజెక్కులఁ, బొదలుచు వెన్నెల • ప్రోవు లాడ
తే. గొనములకు నెల్ల నాటప • ట్టనఁగఁ జాలి, జాళువాబొమ్మపోల్కి న • న్నెలవెల్వ
జంకతాలువుచెంగటఁ • జేరి యడుగుఁ, దమ్ములకు మ్రొక్కు లిడి యున్న • కొమ్మఁ జూచి.

క. పలుతెఱఁగులఁ దీవన లిడి, పలుమఱ నత్తమ్మిచూలి • పంగడవుం జా
బిలి యల కొనిం గని యి, చ్చెలి యెవ్వరిపడుచు తెలియఁ • జెప్పుము దీనిన్. 86

## నీలకుఁ దగినవరునిగుఱించి బ్రాహ్మణుఁడును గుంభకుఁడును మాటాడుట.

క. అరచేతివ్రాలు చూచిన, దొర యెందును లేనిదొడ్డ • దొరఁ జేకొని బల్
సిరుల నిరవందఁగల దీ, విరిఁబోఁడి జగంబులెల్ల • విరివిగఁ బొగడన్. 87

తే. గొప్పకన్నులు నిడువాలుఁ • గురులుఁ జెలఁగు
కొనుఁ గెంజాయ నలరుకే • ల్గవయు నడుగు
లును మొన ల్గలపలుచాలు • వును దనర్చుఁ
గన్నియలమిన్న కివియె మే • ల్చిన్నెవన్నె. 88

చ. అనుటయు బాఁపనయ్య కతఁ • డర్మిలి నిట్లని పల్కె దేవరా
విను మిది నాదుపట్టి కడు • వేడుక నెప్పుడు నీల యంచు నీ
గొనములప్రోకఁ బిల్తు మిది • గో నిపు డీననఁబోఁడి కంద మా
పెనిమిటిఁ గూర్చి సొం పలరఁ • బెండ్లి యొనర్ప మదిం దలంచెదన్. 89

క. ఈకన్నియకుం దగునొక, రాకొమరుని నరసి నిబ్బ • రంబుగ నిపుడే
మా కెఱిఁగింపుఁడు తెలియ, న్నీకుం గనరాని దొకటి • నేలం గలదే. 90

క. నందుఁడు మాకున్ గాదిలి, బందుగుఁ డాతనికి నెజ్జ • బాఁపఁడ వగుటన్
డెందమునకు నీపలుకులు, పొందుగఁ బ్రేఁబల్కునుడువు • పోలికనుమ్మీ. 91

చ. కొలమును గల్మి తాల్మియును • గూర్మియుఁ దెంపును జవ్వనంబునుం
జెలువము విద్దెయున్ గొనముఁ • జేవయుఁ బ్రోడతనంబుఁ దెల్వియుం
గలిగినపిన్నపాపనికిఁ • గన్నె నిడందగు నంచుఁ దీర్పరు
ల్వలుకుదు రట్లుగావున వ • లంతికి నీ కిఁకఁ జెప్ప నేటికిన్. 92

తే. అనిన నతఁ డాతనికి నిట్టు • లనుచుఁ బలికె, వినుము నాయఁడ నామాట • వీను లలరఁ
జేర్మి నీకన్నియకుఁ దగు • పెండ్లికొడుకు, వెన్నతెక్కలికాఁ డైన • వేల్పునుమ్ము. 93

క. వానికి పెనయుగువాఁ డెం, తైన క్షత్రి గలఁడె పుడమి ♦ నటుగాకయు నీ
మేనల్లుం డతనికి ని, చ్చానం బెండిలి యొనర్పఁ ♦ జను నరయంగన్. 94

మ. పెనఁగుంజాడలఁ బోక నాపలుకు నీ ♦ వీన్నోయి కెం పైనఁ డెం
దపరగ న్వెన్నుని కిమ్ము కన్నియను నె ♦ య్యం బొప్ప నీచొప్పుగా
నడువు శ్వేయయు నిఁ కేల డెందమునఁ గ ♦ న్గొను మ్మెన్న నీ కిప్ప డా
నుడివాల్గాలుపు కన్న వేఱు కలరే ♦ చుట్టంబు లేవంకలన్. 95

క. కావునఁ గొదుకక కఱిమై, దేవర కీకన్నె నిమ్ము ♦ తిర మగుమదితో
నావుడు వాతం డట్టుల, కావించెదఁ జొమ్ము వేష్క ♦ గడలుకొనంగన్. 96

తే. నేలవేలుప నందుని ♦ పోగ్రిలి కరిగి, యన్నితెఱఁగుల నతనికి ♦ వెన్నునికిని
గన్నెలాగెల్ల నెఱిఁగించి ♦ కర్జ మీవు, నేర్పు మెఱయంగ వడి సమ ♦ కూర్పవయ్య.

క. నీకుం జెప్పెడిదే మిఁక, నీకర్జపు వేఁగుఁ బూని ♦ యేఁగుము మఱి మీ
రేకద మముబోఁటులకుం, గైకొని మేల్పనులు గూర్పఁ ♦ గాఁ దగువారల్. 98

తే. అనుచుఁ బెనుమానికములు దా ♦ పినవెడంద
పతకమును దావళంబును ♦ బసిఁడియుంగ
రములుఁ బ్రోఁగులుఁ బట్టుఁ బు ♦ ట్టములు మొదలు
గలుగుతొడవులు గడు నడు ♦ గర లొసంగి, 99

చ. పనిచినఁ దద్దయుం బొదలి ♦ పాఱెడువేడ్కలవెల్లిఁ బెల్లుగా
మునుఁగుచు నేలవేల్పు తల ♦ మందరిపల్లియ కేఁగె గొల్లఁడున్
గొనకొని ముద్దుఁగన్నియకుఁ ♦ గోరినయట్టిమగండు గల్గె నం
చును దనయాలుఁ దాను నెదఁ ♦ జొక్కుచు నుండె నెంతయున్. 100

## నీల కృష్ణునియందు వలపుగొని తనలోఁ దలపోసికొనుట.

తే. అంత నీలయుఁ దనతండ్రి ♦ చెంత మిగుల, సంతసంబునఁ బంటవ ♦ లంతివేల్పు
దొంతరగ నన్నకఱివేల్పు ♦ వింతలెల్ల, మంతనంబునఁ దలఁచుచు ♦ నంతఁ బొగిలి. 101

ఉ. ఎన్నఁడు నూతు ముజ్జగము ♦ లేలెడువేలుపుమోముఁదమ్మి నిం
కెన్నఁడు విందు వీనుఁగవ ♦ కింపుగ వెన్నునిముద్దుఁబల్కు లా
వన్నెలప్రోకయాదలను ♦ వావిరిఁ బత్తెలిముత్తియంపుఁబ్రా
లెన్నఁడు నింతు నింతు లవు ♦ డెంతయు నెమ్మిని సంతసిల్లఁగన్. 102

సీ. వెన్నునిచిఱునవ్వు ◆ వెన్నెలల్ పర్వఁగ, వలపుఁ దెంజేఁకటుల్ ◆ దొలఁగఁ గలదె
గుడుసుఁగైదువుజోదు ◆ నుడివాన గురియఁగ, కడువిరాలపుటగ్గి ◆ యడఁగఁ గలదె
కఱివేల్పుచూడ్కిజ ◆ క్కర లుబ్బి పాఱఁగ, బలుగ్రచ్చుఁబైరులం ◆ పండఁ గలదె
మలతాల్పుమెయిచాయ ◆ మబ్బులు గ్రమ్మఁగ, యెదకాఁకపెన్నెండ ◆ వదలఁ గలదె
తే. సోఁకుమూఁకలగొంగ మె ◆ చ్చుగను దాళి
బొట్టు మూసికతోఁ గూర్చి ◆ పొసఁగ వఱుతఁ
ద్రాడు గట్టక సొగసెల్లఁ ◆ దఱిమి యొడల
వ్రేలువలరాచబలుబూచి ◆ వీడఁ గలదె. 103

క. తొలుమోములమే లిప్పుడు, వలనుగఁ జేకూడవలదె ◆ వన్నెలగనికై
యలరెడువలమురితాలుపు, చెలిమి వెసం గలిగి యెల్ల ◆ చెలులుం బొగడన్. 104

సీ. పులుఁగుఁడాల్వేల్పుకెం ◆ దలిరువాతెఱ తేనె, యలుగ్రోల నెన్నఁడు ◆ గలుగునొక్కొ
తమ్మిపొక్కిటిమేటి ◆ యొమ్మునఁ గులుకుగు, బ్బలు చేర్ప నెన్నఁడు ◆ గలుగునొక్కొ
చుట్టుఁగైదువుజోదు ◆ మెట్టదమ్ములఁ గేలుఁ, గవ నొత్త నెన్నఁడు ◆ గలుగునొక్కొ
చిలువపానుపువాని ◆ తళుకుఁజెక్కులముద్దు, గైకొన నెన్నఁడు ◆ గలుగునొక్కొ
తే. వలపు గులుకంగఁ బసిఁడిదు ◆ వ్వలువతాల్పు, మేన గొజ్జఁగపూనీటి ◆ మెఱుపుటింపుఁ
గప్పురంబు జవాదియుఁ ◆ గలిపియిడ్డ, కలప మలఁదఁగ నెన్నఁడు ◆ గలుగునొక్కొ.

ఉ. వెన్నునిచెంతనప్పుడమి ◆ వేలుపుమానిక మేమి దెల్పెనో
చెన్నుగ నన్నియుం దెలిసి ◆ చెల్వుఁడు దా నెటుగాఁ దలంచునో
కొన్నెలతాల్పుముద్దియను ◆ గూర్చి యొనర్చిననోము లిప్పు డే
వన్నెను బండునో నలువ ◆ వ్రాఁత తెఱం గిఁక నెట్టు లుండునో. 106

క. చెలువమును జవ్వనంబును, జెలిమియు నెఱజాణతనము ◆ సింగారంబుం
దలఁపున మెలఁగెడుగొనమును, గలమగఁ దెనలేనితొడవు ◆ గద తొయ్యలికిన్. 107

చ. ఎడపక రేయియుం బగలు ◆ నెమ్మెలనమ్మలతాల్పుఁ గూడిపూ
వడిదపుజోదునిబ్బరపు ◆ టాలమునం దమి హెచ్చ నొచ్చె మె
య్యొడలను లేనిబల్లాయలు ◆ నిమ్ముగఁ గోరుచుఁ జాలఁ బ్రోడ లై
యడరెడుగొల్లకన్నె లహా ◆ హా తొలుబాముల నేమి నోఁచిరో. 108

సీ. తెలిదమ్మికంటివా ◆ తెఱ యాన ముం దెంత, పెనువంతఁ గుందెనో ◆ పిల్లఁగ్రోవి
రక్కసిగొంగపే ◆ రక్కున వ్రాలునం, దుల కేమి నోఁచెనో ◆ తొలవిపేరు

సిరి శ్రీనిద్దంపుఁ ♦ జెక్కు లబ్బఁగ నెంత, గొలిచెనో ముసు గొండ ♦ గోఁగుఁబువ్వు
లాలకాపరిమేళ ♦ నలరంగ నేమేలు, సలిపెనో పసోంబట్టు ♦ సన్నసాలు

తే. దుక్కివాల్దాల్పవనఁగుపై ♦ దోడుమ్రోలఁ
దొడరి యనయంబు నాడంగఁ ♦ బడసినట్టి
పురిపులుఁగుమొత్త మొనలేని ♦ పున్నియంబు
లేమి చేసెనొ సెగకంటి ♦ సామిఁ గూర్చి. 109

చ. దిట మగుచెల్వముల్ గొనముఁ ♦ దేజును గల్గినముద్దుగుమ్మకుం
దటుకున మెక్కపాలసునిఁ ♦ దారిచి బిగ్గర నంటఁ గట్టి చో
క్కట మగు నేపువాని కొక ♦ గ్రద్దతిబాపలచేడెఁ గూరుచుం
గటకట తమ్మిచూలికొఱ ♦ గాములు బాములుగాఁ దలంచెదన్, 110

సీ. ముసిఁడిమ్రాఁకునఁ బండ్లు ♦ పస మీఱఁ గల్గించి, యించున కేల పు ♦ ట్టించఁ డయ్యెఁ
బిల్లిగడ్డకుఁ దావి ♦ పెల్లుగా నొనగూర్చి, కుందనంబున కేల ♦ కూర్పఁ డయ్యెఁ
బందిపెంటికి నైదు ♦ పదియుఁ గూనల నిచ్చి, పాసఁగ నేనిక కేల ♦ యొసఁగఁ డయ్యెఁ
గాకిపిట్టకుఁ జాలఁ ♦ గడలేని బ్రదు కిడి, చిలుకకుఁ దడ వేల ♦ చేయఁ డయ్యెఁ
తే. గొలముకొఱఁత గరాసుల ♦ కలవిగాని, దొరతనము గూర్చి కడుబల్లి ♦ దుల క దేల
తిరిప మెత్తంగఁ జేసె న ♦ ద్దిర కరంబు, వింత లయ్యెను జదువుల ♦ వేల్పుపనులు. 111

వ. అని మఱియును. 112

తే. పాలమున్నీటిగారాపుఁ ♦ బట్టిమగఁడు, వేడుకలు మీఱ ననుఁ బెండ్లి ♦ యాడ నేని
గొప్పచింబోతుకడుపులఁ ♦ గూర్చి నీకుఁ, గావువెట్టింతుఁ జుమ్మి యో ♦ గంగనమ్మ. 113

తే. పూని యాదలఁ దలఁబ్రాలు ♦ వ్రాసి తాళి, బొట్టు మరుతండ్రి తనమెడఁ ♦ గట్టె నేని
వెండిపువ్వుల నపరంజి ♦ విరులచేతఁ, జెలఁగ నించెదఁ గోరి యో ♦ చిలువతాల్ప. 114

క. తనతలపై వడి బల్లిదుఁ, డను వ్రెప్పఁగఁ గ్రొత్తముత్తి ♦ యపుఁ దలఁబ్రా లొ్వ
సినఁ దఱుఁగని యుండ్రంబులు, వెనకయ్యా నీకొసఁగుదుఁ ♦ బ్రిదులనిబత్తిన్. 115

క. అని యెడ యొదవనికోర్కుల, మునుఁగుచు నిలువేలుపులకు ♦ మ్రొక్కుచు నాక్రొ
న్ననఁబోఁడి పలుతెఱంగులఁ, దనలోనం దానె యపుడు ♦ దలఁచుచు నుండెన్. 116

తే. అనుచు నుగ్రశ్రవసుఁడింపు ♦ పొనర నెల్ల, తపసిఱేండ్లకు నెఱిఁగింపఁ ♦ దనివి సనక
వారలవ్వలికతయును ♦ వలను మీఱఁ, దెలుపవే యని సడ్డతోఁ ♦ బలుకుటయును,

ఆ. మత్తగిల్లుసత్తు ♦ గిత్తతత్తడి సెక్కె,మిత్తి మొత్తి నత్తి ♦ నత్తి బత్తిఁ
బత్తి రిడిన ముత్తి ♦ బుత్తులు రెండును, సొత్తిగుత్తగట్టు ♦ చుండు జేఁడ 118

ఉత్సాహ. మొలను దోలఁ గలను జాలు ♦ మొనలవాలు విండువె
న్నెలలఁ బోలు నొడలిడాలు ♦ నీటుదేలు చిల్కమైఁ
జెలఁగునాలు మలను బ్రోలఁ ♦ జెవనిమేలుఁ గల్గి ని
చ్చలును సోలుకొనుచుఁ గ్రాలు ♦ జగము లేలువేలుపా. 119

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్య
ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి
గంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయ
ప్రణీతం బైననీలాసుందరీపరిణయం బను
నచ్చతెనుఁగుప్రబంధంబునందుఁ
ప్రథమాశ్వాసము.



శ్రీశారదామ్బాయై నమః,

# నీలాసుందరీపరిణయము.

అచ్చతెనుఁగుఁగబ్బము

## ద్వితీయాశ్వాసము.

క. సిరుల నిరవొందుగట్టుల, దొరకూరిమిపట్టిఁ గూడి ♦ తొరపుహొయలం
దిర మగునెమ్మిం జెలఁగుచు, నరిమీఱినవన్నెకాఁడ ♦ జగములఱేఁడా.

తే. విను నిరాబారి కొంజ్ల క ♦ వ్వెట్టచెవుల, తపసిరాయఁడు దనదుడెం ♦ దంపుఁదమ్మిఁ
గ్రమ్ముకొనువేడ్క నవ్వలి♦కతయుఁ జాల, నెలమి నెఱిఁగింపఁగాఁ బూని♦యిట్టు లనియె.

### బ్రాహ్మణుఁడు నందునితో వివాహవార్తను మాటాడుట.

ఉ. బల్లిదులార నందుఁ డను ♦ పన్నను వెల్లినజన్నిగట్టు ప్రే
పల్లెకు నంతసంబు మఱి ♦ బర్వఁగఁ గ్రమ్మఱఁ బోయి వేగ యా
గొల్లకొలంపుఁబాల్కడలి ♦ క్రొన్నెలఁ గన్గొని వాని కెంతయుం
దెల్లమిగాఁగ ని ట్లనుచుఁ ♦ దెల్పఁ దొడంగెను నేర్పుపెంపునన్. 3

క. ఒడయుండ నీదుపంపునఁ, గడువడిఁ జని నీమఱందిఁ ♦ గనుఁగొని యతఁ డ
య్యెడ నిడుపూజల నెంతయు, నడరఁగఁ గైకొని కరంబు ♦ నర్మిలి మీఱన్. 4

ఆ. అతనిసేమ మెల్ల ♦ నరసినపిదప మీ, సేమ మతని కెఱుఁగఁ ♦ జెప్పి మేలి
రతనములఁ దనర్చు ♦ రవణమ్ములును బట్టుఁ, బుట్టములును మిగులఁ ♦ బుడుకు లంది.5

క. వచ్చునెడం దనకన్నియఁ, దెచ్చి యతం డెదుట నిలిపి ♦ దీనికి నెనయై
మెచ్చు గను పెండ్లికొడుకును, నిచ్చలముగఁ దెల్పు మనుచు ♦ నెఱిఁ బల్కుటయున్.

తే. నీకు మేనల్లుఁ డగువెన్ను ♦ నికి నొసంగు, చాన నని పల్క నతఁ డంత ♦ నంతసిల్ల
వేయిదెఱఁగుల మీ కిది ♦ విన్నవించి, కర్జ మొనగూర్పు మని కోర్కి ♦ గదురఁ బల్కె.

క. కుందనపుబొమ్మపోలిక, నందంబుల కెల్ల నిక్క ♦ యగునమ్ముద్దుం
గెందలిరుఁబోఁడిఁ బెండిలిఁ, బొందుగ నొనగూర్చు పసిఁడి ♦ పుట్టమువారకున్   8

తే. తడయఁ బని లేదు మేల్పని ♦ తగినచోటఁ, దగిన యొనరింపు మనుచుఁ బె ♦ ద్దలు గడంగి
యాడుచుందురు గావున ♦ నతనితోడ, వియ్య మందంగఁ దగుఁ జుమ్ము ♦ వేయు నేల.

క. అని బాఁపనయ్య యిత్తెఱఁ, గున నేర్పున విన్నవింప ♦ గొల్లలఱేఁ డ
ప్పని కియ్యకొని కరంబును, దనమదిఁ గడలేని వేడ్కఁ ♦ దనరుచు నుండెన్.   10

## కృష్ణునికి బ్రాహ్మణుఁడు నీలను వర్ణించి తెల్పుట.

తే. పాఱుఁ డపు డెదఁ గడుఁ బెంపు ♦ మీఱ నెలమి, నాలకాపరికడకు డా ♦ యంగఁ జేరి
సంతసంబున నతనితో ♦ నంత కంత, కింపు దళుకొత్త మెల్లన ♦ నిట్టు లనియె.   11

సీ. విను సామి నీతండ్రి ♦ పనుపున నీమామ, యగుకుంభకునియింటి ♦ కరుగుదెంచి
యతని నేమం బెల్ల ♦ నారసి మీ నేమ, మెలమితో నతనికిఁ ♦ దెలియఁ జెప్పి
యమ్మేటి యిడుమాని ♦ కమ్ములు సొమ్ములు, వలువలుఁ గైకొని ♦ వచ్చు నెడను
దనముద్దుఁబట్టి నీ ♦ లను దోడితెచ్చి యెం, తయు నెమ్మి దీనికిఁ ♦ దగిన పెండ్లి

తే. కొడుకుఁ దెల్పు మటంచు నన్ ♦ గూర్మి నడిగి
మిమ్ముఁ జెప్పిన నతఁ డపు ♦ డెమ్మె నలరి
నందునకు మీకు నెఱిఁగించి ♦ పొందు మీఱ
నయ్య యిప్పని యొడగూర్పు ♦ మనుచు వేఁడె.   12

తే. జాను మీఱినచానయు ♦ మేనమామ
కూఁతురును లేఁతపరువంపు ♦ గుబ్బెతయును
నెనరు గనిపిన దగుటను ♦ నీకు దాని
కోర్కు లివురొత్తఁ దవులుకోఁ ♦ గూడు నెపుడు.   13

క. ఆకన్నియసోయగ మో, రాకానలనూడ పాఁప ♦ రాకొమ్మలయం
దేకడ నరసిన లేదను, మీ కడమ యిఁ కేల తెల్ప ♦ మీకడ మఱియున్   14

ఆ. చామమోముగోము ♦ చందమామను గెల్వఁ, జాలు మేలు తేనె ♦ జాలుఁ బోలుఁ
గలికికులుకుఁబలుకు ♦ లలవెలందుకగొన, బారునారు తేఁటి ♦ బారుఁ గేరు.   15

ఉ. చిందము చందమామ నుడి ♦ సింగము రిక్కలు నువ్వుఁ బువ్వు మేల్
చెందొవ లద్దముల్ చివురు ♦ చిల్వ మెగు ల్తరఁగ ల్దాన ల్నన
ల్కుందన మంచబోదలును ♦ గుబ్బలులు న్మగఱాలతిన్నెలుం
బొందుగఁ గూర్చి యమ్మెఱుఁగుఁ ♦ బోఁడిని నల్వ యొనర్చెఁబోలుఁబో. 16

సీ. అడుగులు చెందొవ ♦ లారు తుమ్మెదబారు, కన్నులు వాలిక ♦ గండుమీలు
కుత్తుక చిందంబు ♦ గుబ్బలు జక్కవ, ల్మెమ్మోము విరిదమ్మి ♦ నెఱులు నాఁచు
నగవులు మరువులు ♦ నడలు రాయంచలు, ప్రుక్కులు తరఁగలు ♦ పొక్కిలి సుడి
మీఁగాళ్లు తాఁబేళ్లు ♦ మెఱుఁగుఁజేతులు తూండ్లు, చెన్నారుపిఱుఁదులు ♦ దిన్నియలును
తే. గాఁగ ననయంబుఁ బలుసోయ ♦ గంపుఁగొలఁకు
నాఁగ నలువొందునయ్యేల ♦ నాఁగబాగుఁ
బొగడ నలవియె పలుకుల ♦ పొలఁతి కైనఁ
జెలువదొర కైన మఱియు న ♦ న్నలువ కయిన. 17

ఆ. కెంపుఁబెం పడంప ♦ సొంపగు వాతెఱ, మిన్నుఁజెన్ను నెన్నుఁ ♦ గన్నెనడుము
మీలనేలఁజాలు ♦ వాలుఁగన్నుంగవ, తేఁటిదాఁటు మీటు ♦ బోటికురులు. 18

చ. పలుకులఁ దేనెలూరు మెయి ♦ బంగరునిగ్గులు దేఱుఁ జూపులం
దళుకులు మీఱుఁ జెక్కులను ♦ దద్దయు ముద్దులు గాఱు మోమున
న్వలపలరారుఁ గ్రొమ్మొగులు ♦ వన్నియఁ గేరును గొప్పతీరహా
చిలుకలకొల్కిసారు నెఱిఁ ♦ జెప్పఁగ నల్వకు నైనఁ దీరునే. 19

సీ. ఎలనాఁగతుఱుమున ♦ కెనగాక తుమ్మెద, కొదమకూటువులు ప ♦ ల్వాదలు దూఱెఁ
జానవేనలితోడ ♦ సరిగాక యొడలిచూ, ఫులదొరరతనముల్ ♦ పూరిఁ గఱచె
ననఁబోఁడిమనుఁగొప్ప ♦ నకు దీటుగాక ని, చ్చలును జీఁకటులు మూ ♦ లలను డాఁగెఁ
గడుముద్దుగుమ్మక్రొ ♦ మ్ముడితోడ దొరగాక, తొలుమబ్బుతుటుములు ♦ మలలఁబట్టెఁ
తే. జూపఱకుఁ గొలఁదికి మీఱు ♦ సొంపు నింపుఁ, బెంపుఁ గలయులచెలిచెలు ♦ వంపు నెఱుల
గుంపునకు జోకగాక ని ♦ ద్దంపునాఁచు, జొంపములు నీటఁ బడుఁ గడుఁ ♦ దెంపు చేసి.

తే. మగువమొగమున కెనగాక ♦ మిగులఁ బాగిలి
తొగలచెలికాఁడు పదియాఱు ♦ తునియ లయ్యె
సిరుల కిర వగునెత్తమ్మి ♦ విరి దలంకి
యొయ్యనొయ్యన వేమాఱు ♦ వ్రయ్య నయ్యె 21

క. పగడము మంకెనవిరియును, జిగురాకును దొండపండుఁ ♦ జెందిరమును సొం
పగుతమ్మికెంపుగుంపును, ముగుదనిగారంపుఁదొగరు ♦ మోవికి దొరయే. 22

ఉ. పట్టకముండె క్రొన్ననల ♦ బంతులు గందును గోరు నాటఁగ
న్గట్టిగ నుండుఁ గొండలును ♦ గ్గైకొన నబ్బక పోవు జక్కవల్
పట్టుగ రానినం గరఁగి ♦ పాఱెడు మేలిపసిండిగిండ్లు నిం
కెట్టుగ నీ చనం బొనఁగు ♦ నింతిమిటారపుగుబ్బదోయికిన్. 23

క. కొండల మెండును మాఱెటి, పండులసోయగము జక్క ♦ వలకూడిక పూఁ
జెండులపసయును బంగరు, కుండలమెఱుఁగు న్వేలంది ♦ గుబ్బల కడఁగున్ 24

తే. అలరుపొక్కిటిపొన్నపూ ♦ వలన వెసలి, కులుకుఁజన్గుబ్బతమ్మిమొ ♦ గ్గలకు సాగు
జమిలిముక్కాలి కొదమపెం ♦ జా లనంగ, నలరుఁబోఁడికి మెఱుఁగారు ♦ నారు దనరు.

ఉ. దానిపిఱుందునందమును ♦ దానిమిటారపుటారుసౌరునున్
దానివెడందపెందుఱుము ♦ దానిచొకారపుగబ్బిగుబ్బలున్
దానిజగానిగారమును ♦ దానియొయారపుఁదళ్కుఁజూపులున్
దానిమొగంబుఁ గన్న జడ ♦ దారుల కైన విరాళి మొత్తదే. 26

సీ. వలపులదీవి కెం ♦ దలిరుజొంపముమావి, మరునిపూఁదూపు చే ♦ మంతిబంతి
యన్నులతలమిన్న ♦ యాణిముత్తెపుఁగ్రోవ, పండువెన్నెలనిగ్గు ♦ పలుకుఁజిలుక
కపురంపుబరణి ని ♦ ల్కడఁ గన్నక్రొమ్మించు, పగడపుఁదీవ మే ♦ ల్పసిఁడిబొమ్మ
కొదమరాయంచ కు ♦ ల్కుమిటారివన్నెల, గని చొకారపుమాని ♦ కములమూట
తే. యాముకేసుఁగుగున్న యొ ♦ య్యారములకుఁ, దీరు కస్తురిలప్ప సొం ♦ పారుపికిలి
చెండు నాఁగఁ దనర్చి య ♦ చ్చెరువుమీఱఁ, దద్దయుఁ జెలంగుఁజుమ్మ య ♦ మ్ముద్దుగుమ్మ

మ. పలుకు ల్వేయును నిఁ కేల యాచెలువ యా ♦ బంగారుకీల్బొమ్మ యా
కులుకుంబాయపుఁగల్కి యావలఁతి యా ♦ గొజ్జెంగపూబంతి యా
యలరుంబోఁడులమిన్న యాముగుద యా ♦ యందంపురాచిల్క యా
వలపుంగ్రప్పుదీవి యామగువ యా ♦ వాల్గంటి నీకే తగున్. 28

తే. చక్కఁదనమును గానమును ♦ జవ్వనంబు, మక్కువయుఁ బ్రోడతనమును ♦ నిక్కువంబుఁ
దాలిమియుఁ గల్గునిల్లాలి ♦ నేలువాని, కారయఁగ వేల్పురాచప్రో ♦ ల్గోర నేల.

చెలువుఁడ నీయెడం జెవులు ♦ చీఁదఱఁ జెందఁగఁ బెక్కులాగులం
బలుకఁగ నేల నాతలిరుఁ ♦ బాయపుటన్నులమిన్న చెల్మి నీ
కలవడెనేని మేలిపది ♦ యాఱవవన్నెపసిండితోడ వే
ల్పులహారమానికంపురవఁ ♦ బొందుగఁ గూర్చినచంద మౌఁజుమీ. 30

ప్రౌఢ నై చూడఁ దగుగొల్ల ♦ పూవుఁబోఁడి, చెలిమి గల దని దానిపైఁ ♦ దలఁపుమాన
వలదునుమి మంచి పనసపం ♦ డులమెసంగు, జాణలకు మావిపండులు ♦ చవియొకావె. 31

కమ్మవిల్కానిచేతిపూఁ ♦ గొమ్మ ముద్దు, గుమ్మ నిద్దంపుజాళువా ♦ బొమ్మ వలపు
గ్రమ్మ ని మ్మగుకపురంపు ♦ దిమ్మె సుమ్ము, కొమ్మ నెమ్మె దలిర్పఁ నై ♦ కొమ్మ లెమ్మ. 32

## నీలయందలివలపును గృష్ణుఁడు విప్రునితోఁ జెప్పుట.

అని పంటవలఁతిజేజే, వినిపించిన నాలకించి ♦ వ్రేతలమేల్పాఁ
డెనలేనికోర్కె లెదలఁ, ననలెత్తఁగ నతనిఁ జూచి ♦ నగుచుం బలికెన్. 33

ముం దొకకర్జ మూని చని ♦ ముద్దులగుమ్మ నొకర్తు నక్కడం
బొందికసేసి రాసిరులు ♦ పూన్చుచు వేమఱు పీనుదోయికి
న్విం దొనరించి తౌ మిగుల ♦ నేర్పున నోబలు నేలవేల్ప మే
ల్పొందఁగ మీకుఁ జెల్లుఁగద ♦ పొల్పుగ మేల్పను లెల్లఁ గూర్పఁగన్. 34

క. చెన్నొందవెదునన్నవలాఁ, గన్నారం గన్ను లలరఁ ♦ గన్గొనియెడుమే
లెన్నఁడు గల్గునొకో యని, యెన్నొదఁ జూమ్మయ్య మిగుల ♦ నెదలో నెపుడున్. 35

సీ. కలికినెమ్మోముజా ♦ బిలిరంగు లాదవక, చెలువంపుఁగనుఁదోవల్ ♦ చెలఁగు టెట్లు
సకియనుంగెమ్మోవి ♦ చక్కెర జుజ్జుక, వలకాఁకపెనుదప్పి ♦ వదలు టెట్టు
లెలనాఁగబిగికవుం ♦ గిలిజోడుఁ దొడుగక, యెద నంటుబలుతూపు ♦ లెడలు టెట్లు
కొమ్మసింగారంపుఁ ♦ గొలఁకునం దేలక, బలువిరాలపువెట్ట ♦ దొలఁగు టెట్లు

తే. మెలఁతుకలమిన్న నిద్దంపు ♦ మేల్పసిండి
గలుగ కుండిన మదిలోన ♦ గాట మగుచు
నిచ్చలును హెచ్చుకలఁక ♦ నిప్పచ్చరంబు
విడుచు టెటు లింకఁ బరికింపఁ ♦ బుడమివేల్ప. 36

తే. కులుకుఁబాయంపుముద్దుల ♦ గుమ్మ గలుగు
సొగసుకానికిఁ దొఱగంటి ♦ చిగురుఁబోఁడుఁ

బులుఁగు రాచేడియలును జ ♦ క్కులవెలందు
కలును వీనులకంటిచె ♦ ల్వలు నిఁ కేల. 37

క. కన్నియలా గంతయు నిటు, విన్నప్పటినుండి తలఁపు ♦ వే ల్లోకపనిపైఁ
జెన్నలర దన్నితెలుఁగుల, నన్నేలఁడుకఁ గూర్మిఁ బెండ్లి ♦ యాడెదఁ జుమ్మీ. 38

తే. జాళువాబొమ్మ కెన యనఁ ♦ జాలువాలుఁ, గంటి నన్నన్న కన్నులఁ ♦ గంటి నేని
వలవ కున్నను నీకు మే ♦ ల్వలువ లిత్తు, నేలవేలుప యిఁక వేయు ♦ నేల వినుము. 39

చ. అని తెలిదమ్మికంటి మది ♦ వంటి పెనఁగొను కూర్మి నాడినం
గనుఁగొని జన్నిగట్లతల ♦ కట్టవు డెంతయు నుబ్బి సామి నీ
కనికర మింతనాపయిని ♦ గల్గినఁ జాలుఁ గొఱంత యేమి యం
చును వెర వొప్ప నిట్టు లను ♦ చుం బొగడంగఁ దొడంగె నద్దొరన్. 40

## కృష్ణుని విప్రుఁడు పొగడుట.

దండకము. సిరిమగఁడ నిన్నుం దిరం బొప్ప నప్పాఁపఱేఁ డట్టిరాయంచవార్యంబుతో
డైన సొం పార నగ్గింపలే రన్నచోఁ బిన్నలై ప్లిన్నఁగాఁ జాలువా రెన్న నొయన్న
ము న్గాళరాకాసిబల్మూకటువ ల్గోవఁగాలేక పెన్ బ్రేఁగునన్ లోఁగునమ్మన్నఁబూఁ
బోఁడికై ప్రోవులై కూడి జేజేవారల్ వేఁడఁగా వేసబం బొప్ప నివ్వేన మిట్టూని
తా నీవు గావించుచెయ్వు ల్నుతింపం బూని వాక్రువ్వ నెవ్వారికిం దీరు ము న్నీనుమే
నూని మున్నీరు సొత్తెంచి ప్రాఁబల్కు ముచ్చు న్వడి న్ప్రచ్చి నెత్తమ్మి పూఁజూలి
నుబ్బింపవా పెంపు రాణింపఁ దొల్వేల్పులు న్వేల్పులుంగూడి పాలేఱు వే త్రచ్చు
చో మేటితామేటిపై యెత్తి మవ్వంపుఁగవ్వంపుగ ట్టైపున న్వీఁపునం దాల్పవా
నేలయెల్లం దగం గొంచుఁ బెంజిల్వరాలెంకకుం జొచ్చినాజాళువాకంటిరేద్రిమ్మరిన్
జన్నవుంబంది వై క్రమ్మవా కన్నపట్టిన్ లలిం బట్టి కాఱించునవ్వేల్పునూడేలికం
జక్కఁగా నుక్కుఁగంబంబునం బుట్టి చక్కాడవా గుజ్జురూపూని మూఁడంజల న్మి
జ్జగంబుల్ గరం బబ్బురం బొప్ప నాఁకట్టి చాగంపుబల్ రక్కసుం గ్రిందికిం ద్రొక్కవా
గండ్రగొడ్డంట ముయ్యేడుమాఱుల్ కడుం దిట్టవై గట్టిగా నేలఱేండ్లం బడంగొట్టవా
గోత్రికై కోఁతు లాయెల్లలుం గొల్వఁగా నుప్పసంద్రంబుఁ బూఁదోఁటకాల్వన్
వలెన్ దాఁటి చాల్పుండలల్ గల్గురాకాసిఁ బోకార్పవా దుక్కి వాల్ పూని పేరు
క్కునన్ రేఁగవా మ్రాఁకులోఁ దూఱి తొల్వేల్పుఁబూఁబోండ్ల బల్ నోము లొక్క
మ్మడిన్ బన్ని మొందింపవా దొడ్డగుఱ్ఱంబుపై నెక్కి యుప్పొంగుచుం దుల్వరా

పోఁజాలం దీర్పవా దేవరా నీవెకా వేలుపుం బెద్ద వై తద్దయున్నేర్పుతో నిజ్జగం బెల్లఁ
బుట్టించి వెన్నుండ వై నిచ్చలు న్మచ్చికం బ్రోచి యామీఁద ముక్కంటి వై తీర్తు
వెల్లప్పుడు న్నీమెయి న్నల్వగ్రుడ్డుంగను ల్మేడిపండ్లున్వలెం బ్రోవు లై యుండు నీ
బూటకం బెవ్వరు న్నెఱుగా నారయన్ లేరుగా నిన్నుఁ జేకొన్నఁ గన్గొన్న నీ
బల్లిదంపుంగతల్ విన్న దోసంబు లెల్ల న్వెసం బాయు నీమెట్టకెందామరం బుట్టి చె
న్నారుమిన్నేటినీ రింత నై సోఁకఁ బున్నెంబు లెన్నేనియుం గల్గు నీ న్బత్తితోఁ
గొల్వఁగా లేక తాటోటు లై పెక్కురిల్లాండ్రునుం బండ్లునుం బుత్తడుల్ మేడలు
న్మావలుం గోకలున్ రూకలున్ గొట్టెలు న్బట్టలు న్నేలలు న్గోవలుం జూచి వేసా
రకే కాఁపురంబు ల్థిరం బంచు డెందంబుల న్నమ్మి తా రూరకే మేనులం బాసి యా
మీఁదట న్దుంతబాబావశీరుండు గాత్రింప మీఱన్ దొసంగుల్ వెసం బొంద వారిం
దగం జూచి బిట్టేమ్ము వందంబులన్ రోసి యి ల్వాసి తా రెల్లచెయ్యు ల్విడం గోసి
కారాకులు న్దుంపలు న్మెక్కి లోఁ జొక్కుమం బ్రాఁతపల్కుంగొన ల్వారెకుం గాంచి
మే ల్దల్పితో లోనివెల్గుం గనుంగొంచు వేమాఱు న్మైసొల్ని రాబారు లెల్ల న్దిటం
బొప్ప నిన్ గానఁగా నేర రెవ్వారికిం గీడు గావింపఁగా నోడి యేకోర్కు లు న్వీడి
నీపైఁ దలం పెప్పుడు న్నిల్పి లోఁ దాల్మి దైవాఱఁగాఁ జెయ్వు లేమైన నీ కప్పనం
బంచుఁ బూఁట ల్విడిం ద్రోచునా బల్లిదు ల్నీకు విందు ల్గదా నీవు కూర్మిం గనుం
గొన్నచోఁగాక నే నిన్నుఁ గొండాడఁగా నెంతవాఁడ న్నిజం బొప్ప నన్నల్వవు
న్నీవె వెన్నుండవు న్నీవె ముక్కంటివి న్నీవె జాబిల్లివిం బ్రొద్దవు న్గాడ్పవు న్నీవె
ప్రాఁబల్కులు న్నీవె సంద్రంబులు న్నీవె గట్టుంగముల్ మ్రాఁకులు న్నాఁకలు న్నీవె
కా నెంచి ని న్బత్తి నే ప్రొద్దునుం గొల్చెదన్. 41

తే. అనుచుఁ గై వార మొనరించు • నవ్వలంతి
మన్ను వేలుపుమేల్బంతి • మదికి మీఱ
వేడ్క లూనఁ గూర్చి పనిచి య • వ్వెన్నముచ్చు
చెలువచెలువం బె పలుమఱుఁ • దలఁచు చుండె. 42

## కాలనేమికొడుకు లాఁబోతు లై పుట్టి జగములను గాసిఁబెట్టుట.

సీ. అంతట మిథిలలో • నలకుంభకునియింట, మును కాలనేమికి • ననుఁగుఁగొడుకు
లగుతుల్వరక్కసు • లాఱు నొక్కరు దొడ్డ, యాఁబోతు లై పుట్టి • రచ్చెరువుగఁ
జొట్టువాల్దాలుపు • నూడు లెంతయుఁ గ్రొవ్వి, యెనలేని లావున • నెల్లకడల
మెలఁగుచు ససినెల్ల • మేయుచు గోవలు, వెలుగులు పెండెము • ల్విఱుగఁ ద్రొక్కి

తే. దొడ్డిపట్టుల నిల్వక • త్రోవ నెవరి
నెదిరి కొమ్ములఁ గ్రుమ్ముచుఁ • గదిసి కోడె
తెఱవులను బొడ్చుచును వడిఁ • దవిలి ఱంకె
లిడుచుఁ బోగ రెక్కి యున్కన • నదరి రెలమి. 43

క. రెబ్బలుల నైన మార్కొను, నబ్బురపుంజేవ గలిగి • యానతగిబ్బల్
నిబ్బరముగ నాఁడెంపుం, గుబ్బలు లిటు లయ్యె నేమొ • కో యన నలరున్. 44

## ఆఁబోతులయుపద్రవమును బ్రజలు రాజుతోఁ జెప్పుట.

క. చెలరేఁగి యిట్టు లెల్లెడఁ, గలయం ద్రిమ్మరుచుఁ జాల • గాసి యొనర్పం
దలఁకి పజ లెల్ల నవ్వ డ, గ్గల మగుకడగండ్లఁ జిక్కి • గములై పరగన్. 45

తే. పనసపండులు దబ్బపం • డ్లనఁటిపండు, లీడపండులు టెంకాయ • లిప్పపూలు
చెఱకుఁగోలలు దేనియ • ల్తిఱుచుగాను, గొనుచుఁ బఱతెంచి రెకిమీని • కొలువునకును

తే. అరిగి మెల్లన గవనికా • పరులచేత, నేలికకుఁ దమరాకడ • యెఱుఁగఁ జెప్పి
యతని యానతి గైకొని • వెతలు మఱచి, నగుచు నందఱు గొబ్బున • నగరుసొచ్చి.

సీ. మగమానికములక్రొ • న్నిగనిగల్ దులకింపఁ, బలుతమ్మికెంపుమే • ల్పనలు నింప
రేరాచఱాచాయ • క్రేవల నలరఁగఁ, బులుఁగుఱాపచ్చరం • గులు పొసంగఁ
గఱిరతనంపుఁజొ • క్కపుసిరు ల్దళుకొత్తఁ, బగడంపుగుంపు కెం • జిగి యొనర్పఁ
వెలిక్రొత్తముత్తియం • బులడా ల్దువాళింప, వెలుఁగురాఱాహారం • గులు వెలుంగ
తే. మఱియుఁ బేరగు నాఁడెంపు • మానికంపు, గములనిద్దంపువన్నియ • ల్గడలుకొనఁగ
నందములకెల్ల నుక్కిపు • ట్టనఁగఁ జాలు, మేలిపని సొంపుఁజాలువా • మేడలోన. 48

తే. దొరలు మన్నీలు చెలులు బం • దుగులు జెట్లు
బంట్లు కబ్బంపుఁగూర్పరు • ల్పాశిగాండ్రు
గడనచేడియ లూడిగీల్ • గాణలొజ్జ
బాఁపనయ్యలు దీర్పరు • ల్బలసి కొలువ. 49

సీ. బంగారుఁదగటు దు • ప్పటిచెఱంగులరంగు, మేచాయ కొకక్రొత్త • మెఱుఁగు చూప
బలుముత్తియపుఁజొక • టులహాలు నిద్దంపు, బవిరిగద్దెమీఁదఁ • జవుకళింపఁ
బూపవెన్నెలకెనిఁ • బోలుసెన్నెసలిప్పై, జిలుఁగుఁగస్తురిబొట్టు • చెలువు మీఱ
సొగసుగా విరిసరుల్ • చుట్టి గట్టిగ నిడ్డ, సిగపెంపు నాఁడెంపు • సిరుల నీన

తే. గొప్పరతనంపుఁబతకము ♦ ల్గొలుసు లుంగ,రములు మురువులు సింగార ♦ మమరఁ బూని
వేడ్క లిగురొత్త రెండవ ♦ వేల్పు కోని,కరణిఁ గొలువున్న దొరఁ బొడ ♦ గాంచి యపుడు.

తే. తమరు గొనిచన్న నరకు లెం ♦ తయును బత్తి,నప్పనము చేసి మిగుల జో ♦ హారు లొసఁగి
కేల్గవలు మోడ్చుకొని యొక ♦ క్రేవ నిలిచి,మొదలఁ గొంకుచు వాక్రుచ్చి ♦ రిట్టు లనుచు.

క. దేవర నీ పీపజలను, బ్రోవఁగ నిన్నాళ్లదాఁకఁ ♦ బొదలుచు మేమున్
ఠీవి దలిర్పఁగ నెదలో, నేవెఱపును లేక యుంటి ♦ మెసలనికడిమిన్. 52

క. ఇప్పుడు వినె యచ్చెరు వై, చెప్పంగా రానిదొడ్డ ♦ చే టొనగూడెం
దప్పక యాలింపుము నీ, విప్పట్టునఁ గిమక లేక ♦ యొలమి తలిర్పన్. 53

ఉ. గొల్లలనాయఁ డై పరఁగు ♦ కుంభకుమంద న దేమివింతయో
కల్లరిగిబ్బ లేదు పొడ ♦ గట్టి పజం గడు గాసిఁ బెట్టుచుం
గొల్లగ నెల్లపైరులను ♦ గొంకును జంకును లేక మేయఁగాఁ
దల్లడ మంది వచ్చితిమి ♦ తద్దయు మీ కిది దెల్పఁగోరికన్. 54

క, గిబ్బ లవి కాఁపువారల, గొబ్బున నొకముద్దఁ జేసి ♦ కొని ద్రిమ్మఁగఁ జామీ
దబ్బఱలుగఁ జూడకు మో, యబ్బా బెబ్బులుల కైన ♦ వటు జంకుదుమే. 55

క. చలపాడిచి ఱంకె లిడుచును, బలుమఱు ముంగాళ్లఁ ద్రవ్వి ♦ బలువిడిఁ బసికాఁ
పులఁ గ్రుమ్మి విడుచుఁ బైకొని,పాల మంతయు నవియె యగుచుఁ ♦ బొగరు సెలంగన్.

తే. ఆకుఁదోఁటలు నుగ్గాడి ♦ యరఁటితోఁట, లెల్ల మల్లడిగొనఁ ద్రొక్కి ♦ యుల్లికంద
సమపుఁదోఁటలు జంగిలి ♦ కనవుబీళ్లు, చెఱకుఁదోఁటలు పండిన ♦ చేలు దీర్చె.

క. ఓరాయఁడ యీయంగద, కోరున లే కిటకు వచ్చె ♦ నాళ్లన్నియు మే
మూరక దబ్బఱలాడఁగ, నేరము నాతొల్గ కయిన ♦ నీయానసుమీ. 58

ఆఁబోతులఁ బట్టింపు మని రాజు కుంభకున కాజ్ఞాపించుట

చ. అన విని నేలఱేఁడు వెఱఁ ♦ గందుచు వారల నూఱడించి యి
ప్పని నవరింతుఁ బొం డనుచుఁ ♦ బంపి యొదం గడుఁ గిన్క మీఱ గొ
ల్లనిఁ బిలిపించి నీవు పది ♦ లంబుగఁ గోడెలఁ బట్టకున్న వా
మునఁ దవరారుచున్ మొదలు ♦ ముట్టఁగ మేయును పైరు లన్నియున్. 59

క. గట్టిగ నీ వీఁక వానిం, బట్టింపుము గాకయున్నఁ ♦ బంటింపక పెం
గట్టడవి కయిన వెడలం, గొట్టింపుము చేయవేనిఁ ♦ గొఱగాదునుమీ. 60

క. బలువిరి గలుగుట కొఱలం, గలఁచుట యెవ్వారి కయినఁ ♦ గటకట తగునే
బలిమి గలవాఁడ వగుచీ, కలగిబ్బలఁ బట్టరాదె ♦ యూఱడి మేతే. 61

తే. అనుచు నొండయుఁడు నుడివిన ♦ విని యతండు
తలఁకి రోహింద్రి యాకోడి ♦ యలను బట్టి
గట్టిచేసెద నీక నింత ♦ కనరవలవ
దంచుఁ గడు వేఁడుకొని యింటి ♦ కరిగె నప్పుడు. 62

## ఆఁబోతులను బట్టం బూని గొల్లలు భంగపడుట.

క. తనచుట్టంబుల నందఱఁ, బనివడి రావించి యేని ♦ పలుకులు దెలియన్
వినిపించి గిబ్బలను గొ, బ్బునఁ బట్టఁగ వలయు నంచుఁ ♦ బురికొల్పుటయున్.

తే. గొల్ల లెల్లను బెల్లుగ ♦ వల్లియులును
బల్లిదపులంకెపలుపులు ♦ నెల్లముగను
బూని యమ్మేటిపొగరు టాఁ ♦ బోతుతుటుము
బలిమి నెఱయంగ డాకొని ♦ పట్టఁ దొడఁగి. 64

క. పలుత్రాళ్లు వైచి యయ్యెడఁ, బలుమాఱును దఱిమి యురులు ♦ వన్ని కడున్ దొ
డ్డులు వాఁగి మోఁది రోదం,బులు ద్రవ్వియుఁ బెక్కుచంద ♦ ములఁ బెనఁగునెడన్.

సీ. పలుపగ్గములు ద్రెంచి ♦ కలఁబడఁ గొందఱు, బొజ్జలు ప్రయ్యంగఁ ♦ బొడిచి పొడిచి
యెగని చెంగున దాఁటి ♦ పొగరునఁ గొందఱు, డొక్కలు నలియంగఁ ♦ ద్రొక్కి ద్రొక్కి
తోడరి పట్టఁగఁ బోవఁ ♦ దొడఁగినఁ గొందఱఁ, దలల నెత్తురు లుర్లఁ ♦ దాఁచి తాఁచి
కెరలి పేరమువాఱ ♦ యుఱవడిఁ గొందఱఁ, దుమురుగాఁ బుడమిపైఁ ♦ ద్రోచి ద్రోచి
తే. గబ్బితనమున హెచ్చి య ♦ గ్గిబ్బకదుపు, నిబ్బరంబుగఁ బట్టంగ ♦ నబ్బకున్న
జబ్బుపడి యందఱును గడు ♦ నబ్బురముగ, బొబ్బ లిడుకొంచుఁ బాఱిరి ♦ ప్రోలిదరికి.

క. ఆటువలె బలియురు పెక్కం, డ్రటుమటమైఁ జన్న విన్న ♦ నగుచున్ మిగులన్
దిటము చెడి గొల్లవాయఁడుం, గటకటఁబడి యింక నెద్ది ♦ కర్జం బనుచున్. 67

## ఆఁబోతులం బట్టినవానికి నీల నిచ్చునట్లు కుంభకుఁడు చాటించుట

తే. కొంతతడ వెంతయును మదిఁ ♦ గుంది యొడయుఁ
డేమి గావించునో యిఁక ♦ నెట్టు లతని

మోఁదిలఁ దెల్పుదు నీయాము ♦ టూలపోతుఁ
బిండు నెవ్వాఁడు గెల్వఁగ ♦ లండు పూని. 68

తడయఁ బనియేమి మిసుసిగ ♦ దయ్య మింక
నెట్టు గావింప నున్నాఁడొ ♦ యెవ్వఁ డెఱుఁగు
నబ్బురం బొప్ప నిత్తఱి ♦ నహహ యెట్టి
కీడునకుఁ బుట్టెనో యిట్టి ♦ గిబ్బ లేదు. 69

అని యెంచు వెరవు దోఁపక, పనివడి యిక్కోడియలను ♦ బట్టఁగఁ గలజా
ణని కిచ్చెద నీకన్నియ, నని యెల్లెడలందుఁ జాట ♦ ననిచెన్ నరగన్. 70

## తండ్రిచాటించుటను విని నీల చింతిలుట.

అటుల దనతండ్రి చాటిం, చుట చెలికత్తియలవలనఁ ♦ జొప్పడ విని మి
క్కుట మగువంతలఁ గుందుచు, దిట మింతయు లేక నీల ♦ దిగు లెదఁ బొదువన్,

అక్కట తండ్రి యేల మరు ♦ నయ్యకుఁ బెండ్లి యొనర్తు నంచుఁ బె
న్మక్కువ నుండుచోఁ దెఱఁగు ♦ మాలినటక్కరియాలపోతు లి
ల్లెక్కడనుండి కల్గెనిపు ♦ డెవ్వరు నెవ్వగఁ దీర్చువార ల
మ్మక్క హళిక్కి యానన వ ♦ యంబు మది న్వెతఁ జెంద నాయెఁగా, 72

ఇత్తెఱఁ గంతయు నిపు డా, వృత్తడిదువ్వలువతాలు ♦ వున కెవ్వారల్
బత్తి నెఱిఁగించి యొదలోఁ, దత్తఱ మంతయును దీర్పఁ ♦ దగియెదువారల్. 73

తే. వెన్నుఁ డీమాట వీనుల ♦ విన్నయపుడె, వచ్చునో లేక యీపని ♦ కిచ్చ యిడఁడొ
వచ్చి గిబ్బలఁ గూల్చునో ♦ వానివలన, వీఁగి యేఁగునొ యిఁక నెద్ది ♦ వెరవు గలదు,

తే. సోఁకుమూఁకలగొంగ యి ♦ చ్చోటికెమ్మె, లూర గొబ్బున వేంచేయ ♦ కుండెనేనిఁ
జెల్లఁబో యింక నెటువంటి ♦ చెనఁటిగొల్ల, చెట్టఁ బట్టంగ దయ్యంబు ♦ చేయునొక్కొ.

సీ. దట్టంపుమిన్నాఁక ♦ తరఁగచాల్పునఁ దేలు, తెలిపుల్గు బురదగో ♦ తులకుఁ జను నె
పుడంకుమాన్వలితావి ♦ పువ్వుఁదేనియ లాను, మగతేఁటి తుమ్మెదా ♦ మ్మలకుఁ జను నె
తొలుమొగుల్ నిడుచిన్కు ♦ లెలమిఁ గ్రోల్వానకో, యిల బలుమంచునో ♦ నలకుఁ జను నె
పరువంపుఁ గ్రొమ్మావి ♦ పండు లేపున మెక్కు, చిలుక గాటపుటుమ్మె ♦ తలకుఁ జను నె
తే. పక్కిరాజక్కిదొరచెల్మిఁ ♦ జక్కఁ గోరి, చొక్కుచుండెడుడెంద మ ♦ మ్మక్కయొక్క
తులువమానిసితోడఁ బొం ♦ దునకు నిచ్చ, యిడఁగఁ జూచునె తలఁప నె ♦ య్యెడలనైన,

తే. పుడమిలోపల మగవాఁడు ♦ పూని తనకుఁ, గోర్కి యగుకల్యకంటెఁ గై ♦ కొనుచు నుండు
నహహా తమమది కిచ్చయో ♦ నట్లు మెలఁగఁ, గన్నియల కేమిటికి బల్మి ♦ గలుగ దయ్యె.

సీ. వ్రేపల్లెనుండి ము ♦ న్నేవుతో నిచటికి, నేలవేలుపుఁ బెద్ద ♦ యేల వచ్చె
వచ్చి మచ్చిక మీఱ ♦ హెచ్చుగా పొంబట్టు, సాలుదాలుపుఁ గత ♦ లేల తెలిపెఁ
దెలిపినఁ దండ్రి య ♦ చ్చెలువున కీజవ, రాలి నిచ్చెద నని ♦ యేల పలికెఁ
బలికినమాట యే ♦ ర్పాటుగా విని తన, యెదఁ గూర్మి యతనిపై ♦ నేల పొడమెఁ
తే. బొడమెఁగాకేమి పొగరుటాఁ ♦ బోతు లేదు, నిత్తెఱంగున దొడ్డిలో ♦ నేల కలిగెఁ
గలుగుటకు నేల తోఁ డేల ♦ కాఁక పేర్చె, నయ్యయో దయ్యము నిఁ కేమి ♦ యనఁగఁ గలదు

తే. చిలుకవార్వంపుమేటివ ♦ జీరుఁ గేరు, నాలకాపరి సోయగం ♦ బనవు మీఱఁ
దలఁచినపు డేమొ కాని డెం ♦ దమున దిగులు, పాయఁగా నేర దిఁక నేమి ♦ సేయుదాన.

క. ఇప్పని దలిదండ్రులకుం, జెప్పఁగవలె నంచుఁ దలఁప ♦ సిబ్బితి మిగులన్
ముప్పిరిగొనుచుం బైపయిఁ, గప్ప నెరులచాటువారు ♦ గారే కన్నెల్. 80

చ. వలనుగ మేలుగీల్లు గుడు ♦ వం దగువా రని నమ్మి యెంతయుం
జెలిమి దలిర్ప నిత్తెఱఁగుఁ ♦ జెప్పఁగఁ జూచిన సారెసారెకుం
గిలకిల లాడుచు న్నగులఁ ♦ గేకలు గొట్టుదు రింతె కాని చి
క్కులు సడలించి మేలుపనిఁ ♦ గూర్పఁగ నేర్తురె రాచవెచ్చెలుల్. 81

తే. అలర వలమురితాలుపు ♦ చెలిమి తనకుఁ, గలుగ నుండిన నేటికో ♦ తలఁవ నింక
వలవ నెవ రేమి చేసినఁ ♦ దలఁక నంచు, నంత కంతకు నగ్గలం ♦ బైనతమిని. 82

## నీల మన్మథావస్థలం బడుట.

సీ. కనుదోయి కెలఁకులఁ ♦ గ్రమ్ము వెన్నెట్టిజా, ల్వలితంపుగబ్బిగు ♦ బ్బలను ముంప
నుడివ్రాని వేఁడిని ♦ ట్టూర్పుగాడుపుల బ, ల్పదలఁ గెంజిగి పోవి ♦ వాడువాఱ
వెడవిలుకాఁడు బ ♦ ల్విడి నించుపూవంప, జల్లు పెల్లున మేను ♦ దల్లడిల్ల
దట్టంపువలపులఁ ♦ దమి బెండుకొని సారె, సారెకు గుండియ ♦ జల్లనంగఁ
తే. దాళఁజాలక మదిలోనఁ ♦ దగులు తాళిఁ, గూలి పోలుచుఁ జాలవి ♦ రాళిఁ దేలి
తేలి వెచ్చలిబారఁ బోఁ ♦ దోలి మేలి, పూలపానుపుపై వ్రాలి ♦ వాలుఁగంటి. 83

క. ఊసురను రనుచుం బొరలును, గసరును బన దతిఁగి వెనను ♦ గడగడ వడకు
న్వాసపున బునవెట్టును వె, క్కస మగువలరాచనిగలఁ ♦ గ్రాఁగుచు మఱియున్.

లయాఁ చూఁ దనలోనఁ • దాన నవ్వుఁ గలంగుఁ, గలవరించును బయల్ • గౌఁగిలించుఁ
జవకే పలుకుఁ గ • న్నులు మూయుఁ జెక్కిటఁ, గై సేర్చు బెదరు న • ల్గడలు వెదకు
లిగాడ్పు దూఱు నం • చలఁ దోలు దయ్యంబుఁ, దిట్టు మైతొడవులఁ • దీసి వైచు
ోటులఁ గనరు గొ • బ్బున లేచి చిల్కల, నదుచుఁ బల్మఱుఁ గొప్పు • విడిచి ముడుచు
కుఁ జిడిముడిపడి సొమ్మ • సిలు దిటమ్ము, లేక కన్నీరు నించు న • లించు నోకి
ంచుఁ బిమ్మిట గొను దత్త • అించుఁ జాల, వలరువిలువాల్ప తండ్రిపైఁ • దలఁపు నిలిపి.

## చెలికత్తెలు నీలకు బుద్ధులు చెప్పుట.

ట్టిరొయఁ జెలిమికత్తియ, లట్టియలఁగఁ గూడి చేడె • యం గని యని రీ
ెట్టిదవువగలఁ బొగులుచుఁ, గట్టా నీ విట్టు దయ్యఁ • గాఁదగునె చెలీ. 88

న్నియవుగాని ప్రోడవు • గావు నీవు, వువ్వుఁబోఁడిరొ సిగ్గెల్లఁ • బోవ నడిచి
లుదొనంగులఁ బొరలఁగఁ • బాడె నీకు, నించుకేనియు మదిలోన • నెంచ వకట,

ద్దంబు గని తద్ద • నిద్దంపుఁ గస్తురి, ముద్దునెన్నొసలిపై • దిద్ద నేమి
సప్పలై కప్పన • సొప్పారు పెన్నెఱు, లింపుగా దువ్వి పా • టింప నేమి
సొమ్మై నిమ్ముగ మాని • కమ్మల సొమ్ములం, దమ్ముగా నెమ్మేనఁ • దాల్ప నేమి
పెట్టెఁ బెట్టినయట్టి • జట్టిమీఱినపట్టుఁ, బుట్టముల్ మట్టుగాఁ • గట్ట నేమి
గోరి రోరిమి నోరెంబు • గుడువ నేమి, తోడర పలిదావివిరసరుల్ • ముడువ నేమి
తనువు దరికొత్తఁ బలుకులు • నుడువ నేమి, చామ నీ కిది రోటువంటి • జాడ చెపుమ.

పలుదెఱఁగులఁ గలఁగుచు నిట్టు, వలెఁ గొదుకఁగ నేల లాఁతి • వారమె నీకుం
దలఁపునఁ గలపనిరొల్లను, దెలుపవె మాతోడఁ బలికి • దిటముగఁ గలికీ. 89

తగులమునఁ దగిలి నీ వి, పగిది న్నిగి తజఁగి రేయుఁ • బవలు న్నిగుల
న్పగలం బొగులఁగఁ దగవా, మగువా నగువారి నెట్లు • మదిఁ దలఁప వరా. 90

చిలుకబోదల మచ్చి • కలు చేసి ముద్దులు, చిలుకఁ బద్దియములు • చెప్ప రాదె
తెలిపిట్టగమిఁ జేరఁ • దీసి తద్దయు బుద్ధి, దెలిపి మెల్లన నడల్ • దీర్ప రాదె
నెమ్మికొంటువుల గా • టమ్ముగాఁ గూరిచి, నెమ్మితో నాటలు • నేర్ప రాదె
బట్టికాఁడుల నింపు • పుట్టునట్టుగఁ గేలఁ, బట్టి మాటలఁ గఱ • పంగ రాదె
చెలఁగి పూఁదీవియలఁ బ్రోది • సేయ రాదె, మేలిరతనంపువీణియ • మీటఁ రాదె
వలువుగా వెచ్చెలులఁ గూడి • నవ్వ రాదె, కలికి నీ డెందమునఁ జిక్కు • పలుకు మాని.

చ. కులుకుచుఁ జేరి యాటలకుఁ • గూరిమి నెచ్చెలు లెచ్చరించినం
బలుక వదేమి యేమఱక • పజ్జల నిల్చినయూడిగంపుటిం
తులఁ గని తద్దయుం గినుక • తో వదలించెద వేమి వేమఱుం
జెలులకలోల్కి నీ వెదలఁ • జిన్నెయ లెన్నఁగఁ గ్రొత్త లిత్తఱిన్. 92

క. లేమా నీ వెత మానుము, లేమా యీమాటమున వ • లింపఁగ నిప్పు డే
లే మాఱుమాట యొసఁగుము, లేమా యిసు దలఁక నేల • లేదుగ మీఱన్. 93

తే. బేల యీచేరజపుఁదనం • బేల యింక, నాన యంతయు మదిలోన • నానఁబోక
నిచ్చలం బొప్ప మాటాడ • నిచ్చయైన, దెల్ల నెఱిఁగింపు మంతయుఁ • దెల్లముగను.

క. అని యనుఁగుంజెలు లిత్తఱి, గునఁ బల్కిన నాలకించి • కోమలి మిగులం
దనడెందంబునఁ గోరిక, లినుమడి యై యెగడ వారి • కిట్లని పలికెన్. 95

చెలికత్తెలతో నీల తనతలఁపు దెల్పుట.

తే. వినుఁడు చెలులార నామాట • వెనరు మీఱఁ, దలఁపులో వార లౌమీఱు • దాఁప నేల
డెంగ మంతయుఁ గజీవేల్పు • నందుఁ దగిలి, తురలఁగా నేర దిఁక నెద్ది • వెరవు చెప్పుఁడ.

ఉ. చక్కరవింటిజోదు నెక • పక్కము లాసఁగఁ జాలుపక్కిరా
జక్కివజీరుచెల్వు చెవిఁ • జక్కఁగ నాటినవాఁటనుండి య
మ్మక్క యదేమొకాని యెద • నంటినకూరిమి యంతకంతకున్
వెక్కసమై పెనంగొనుచు • వేమఱుఁ బాయ దిఁ కేమి సేయుదున్. 97

ఆ. మిన్నజిన్నిగట్టుఁ • గ్రొన్నెల వెన్నని, చెన్ను మీఱ నప్పు • డెన్న మున్న
విన్న కతన నెపుడుఁ • గన్నులఁ గట్టిన, ట్లున్న దిదియు లేక • యున్నలార, 98

తే. తప్పు లెన్నక మొదలి నే • స్తంబుఁ దలఁచి, యిప్పు డిప్పని యొనగూర్పుఁ • డొప్పమీఱ
మీర లావరించునట్టియ • స్నేలు మఱచి, దానఁ గామజాఁడీ యొందు • జాణలార.

క. అనుచుఁ గడలేని యంగద, గనఁబడ నప్పడఁతి వేఁడి • కన్నీ రొలుకం
దనతెఱఁ గెఱిఁగించిన విని, యనుఁగుంజెలు లెల్ల దాని • కని రిట్లనుచున్. 100

చెలికత్తెలు నీల నెగ్గులాడుట.

క. కన్నియరో యంతపని కయి, వన్నెయు వాసియును దఱిఁగి • వగచెద వకటా
ని న్నేమి యనఁగఁ గల మీ, మున్నటికలు వినుట లేదు • మున్నెచ్చోటన్. 101

చెలి పెనిమిటిపై, నబ్బురపువ్వులవు నిలిపి ♦ యలమట మీఱన్
విడిచెదు నీకున్, గబ్బితనం బిట్టు లేల ♦ కలిగెనె పొలఁతీ. 102

రొకింత లేనివల ♦ కాఁకలఁ గ్రాఁగుదు లోఁగి తాఁగ వై
డిపాటుతోఁ జెలులఁ ♦ జెంతలఁ జేరఁగ నీక తద్దయున్
ందవనంబుఁ బూని సరి ♦ గన్నియ లందఱు నవ్వ నయ్యయో
వ మారి యిప్పగిది ♦ సాడఁగఁ జెల్లునె ముద్దుఁగన్నెకున్. 103

మ్మకంటి యి ♦ ప్పలుకు విన్నంతనే, కడలేని వేడ్క ని ♦ క్కడకు వచ్చు
యచ్చెరువుగా ♦ రెచ్చి పాఱెను గిబ్బ, పిండు సొక్కమ్మడిఁ ♦ జెండి వైచు
పెంగూర్మి చా ♦ ప్పడ పెన్నఁగా రాని, పేర్మితో ని న్నిందుఁ ♦ బెండ్లియాడు
నాఁడె పుట్టెఁబైఁడి ♦ యందలంబున నిల్పి, కొని తనపల్లియ ♦ కొనర నరుగు.
రతనంపు మేటియుఁ ♦ ప్పరిగలోనఁ
వు మీటినగొజ్జెఁగ ♦ సెజ్జమీఁదఁ
దెఱంగుల వలరాచ ♦ పనుల నిన్ను
యుఁ గరఁగించు నమ్మమీ ♦ మెఱుఁగుఁబోఁడి. 104

ద్దులపట్టివి నీకీ, గద్దఱిచందముల మెలఁగఁ ♦ గా రాదునుమీ
వ్వయుఁ బెద్దలఁ దలఁపక, ముద్దియ నీ కింత దెంద ♦ మున వెత యున్నే. 105

లఁదిలేని వేడు ♦ కల మును పెంచిన, యంచచిలుకగముల ♦ నలుక మీఱఁ
డర నడిచి పాఱఁ ♦ దోలెద విది యేమి, తప్పు చేసె నిపుడు ♦ కలికిఁబోఁడి.

లివ యొన్నఁడు మామాట ♦ కడుగుదాఁట, కుందుదానవు నేఁ డేమి ♦ యొందు దెఱఁగు
గాని మాటికి నుడువంగ ♦ రానికినుక, సేసెదవు నేర మెద్ది మా ♦ చెంతఁ జెపుమ.

లనాఁగరో నీకోరిక, వలనుగఁ జేకూరె నింత ♦ వల వంతయుఁ దా
లుచును మాపైఁ బలుమఱు, నలుక కడు న్నిగుడ నెగ్గు ♦ లాడకు మింకన్. 108

అనిన విని ముద్దియ తద్దయుం బ్రౌ ద్ధూరకుండి యన్నెచ్చెలిపిండునకు వెండియు నిట్లనియె. 109

## నీల చెలికత్తెలపై నలిగి మాటాడుట.

ముమ్మర మైనబల్వెతల ♦ మున్గుచు నుండెసుదానిచుట్టును
గ్రమ్మి పడంతులార కొలఁ ♦ గాములు వేమఱు నెంచ సాగి నా

రమ్మక చెల్ల యల్లచిగు ♦ రాకుఁగటారికడిందికోదుఫ్రా
వమ్ములబారి కోర్వఁ దర ♦ మా పెఱమాటలు వేయు నేటికిన్. 110

క. కడనుండి పెక్కుమాటలు, నుడువంగా వచ్చుఁగాక ♦ నూల్కొనియెదుపల్
కడగంట్లఁ బనఁగ వచ్చునె, విడువక యొవ్వారికయిన ♦ వెలఁదుకలారా. 111

క, ఆకటా వెడిదపువలపుల, సెకలంబడి క్రేఁగుచానిఁ ♦ జేపట్టఁగ నె
ల్లక యిటువలె నెంతురె ని, ప్పకలకయి న్నేయి చల్లు ♦ పోలిక మీఱన్. 112

తే. వినుఁడు నామాట లిపుడు మీ ♦ వీను లలర, సైఁప కుండిన నింతియ ♦ చాలుఁగాని
యింక నేమియుఁ గోఱగాని ♦ యొగ్గులాడఁ, బోకుఁడీ మీకు మ్రొక్కెద ♦ బోటులార.

ఉ. కూరిమిబోటు లంచు మిముఁ ♦ గొండగ నచ్చుచు నున్నచో నరో
నేరము లెన్నుచు న్మగుల ♦ నెవ్వగలం గలఁగించి పారెకుం
గేరద రింతకాని మది ♦ కిం గడు నెమ్మి దలిర్ప నేర్పుతోఁ
గోరినకోర్కి మీఱ నను ♦ కూర్పఁగఁ జాలుదురే యొకింతయున్. 114

ఉ. చక్కఁదనంబు జవ్వనము ♦ జాణతనంబు గోనంబుఁ దేజఁ జెం
పెక్కినయుక్కునన్ సిరియు ♦ నిమ్ముగఁ గల్గి చెలంగు చున్నయా
రక్కసిగొంగపైఁ గడుఁ ది ♦ రంబుగ నిల్పిన డెంద మింకఁ దాఁ
దక్కరి నొక్కనిం గవయు ♦ ట న్నటఁ గోరునె మాట. లేటికిన్. 115

క. మామాట సేయ దని యిం, కేమియు నుల్లముల నలుక ♦ లిడఁ బోవక మీ
గీములకుఁ బొండు గొబ్బున, వేమాఱును గేలు మొగిచి ♦ వేఁడెద మిమ్మున్. 116

చ, గొనకొని మీరొడన్ నెఱయఁ ♦ గూరిమి డెందములోనికస్తి మం
తనమునఁ దెల్ప నేరుపురె ♦ తద్దయుఁ జాపితి నింతె యందఱున్
వినిరొందునట్లుగా నిఁకను ♦ వేమఱు నామున నవ్వుకొంచు నో
యనుఁగు వెలందులార మను ♦ నాఱడిఁ బెట్టకుఁడమ్మ వేఁడెదన్. 117

వ, అని యిత్తెఱంగున నమ్మెఱుంగుఁబోఁడి బిత్తరించుచుం గొత్తవలవంతలఁ దత్తఱించుచుఁ
బుత్తడిదువ్వలువబాలుపుసయి నత్తినబత్తిం జెలికత్తియలమొత్తంబుల నొత్తి యాడుచు
నీడులేనికోర్కుల నువ్విళ్లూరు చుండె నని నిరాబారిసింగంబులకుం గతయొఱిఁగించు
జడదారి వినిపించిన వార లతని నవ్వలికతయుఁ దెలుపు మని వేఁడిన.

మ. మలయూ దగ్గి జయుండు రక్కసుఁడు నీ ♦ ర్తితొల్పురాగాద్భుజ
క్కులకొండ్లు న్విసదారితొలుపున బ ♦ ల్కుంబోటిగేస్తుండుఁ బు
ల్గలరాడాళ్లొరయు స్మైన ల్గలుగువే ♦ ల్పు ల్గొల్వ నవ్వెండిగు
బ్బలిపై నుండి జగంబు లేలుబలువే ♦ ల్పా గట్టువిల్దాలుపా. 119

తే. కడలిదొన పాఁపనారియుఁ ♦ బుడమితేరు, గట్టువిల్లును దొలిపల్కు ♦ గమిగుఱాలుఁ
బులుఁగుడాళ్వేల్పు ములికియుఁ ♦ బూనికడిమి, మెఱయఁదిగ్రపోల్గు గూల్చిన ♦ మేటివేల్ప.

మాలిని. కదలనిబలుతేరుకా ♦ గాడుపుకా మేయుపేరుం
గుదురగుశిలయేఱుం ♦ గొండపై మేల్చిడారుం
గొదుకక పలుమాఱుం ♦ గోరికల్ గూర్చుతీరుం
బొదలెడిమెయిసొరుం ♦ బూని యొప్పారుమేటీ. 121

ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్య
ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచి
గంగనామాత్యపుత్త్ర బుధజనవిధేయ తిమ్మయనామధేయ
ప్రణీతం బైననీలాసుందరీపరిణయం బను
నచ్చతెనుఁగుం బ్రబంధంబునందుఁ
ద్వితీయాశ్వాసము.



శ్రీశారదాంబాయై నమః.

# నీలాసుందరీపరిణయము

అచ్చతెనుఁగుకబ్బము

## తృతీయాశ్వాసము.

క. సిరిపెనిమిటియుం బలుకుల, గరితమగఁడుం బొగడ మెచ్చు • గాంచినగట్టుం
దొరముద్దుఁబట్టిడెందపు, విరిదమ్మికొలంకుఁదేఁటి • వేల్పులమేటీ.

వ. విను మన్నిరాచారి రాచారులకుం గత యెఱిఁగించుజడదారి యి ట్లని చెప్పందొడంగె
నట్లు గొల్లరాకన్నియ వన్నియ దఱిఁగి యెన్నరానివగలం బొగులు చున్నంత. 2

### సాయంకాలవర్ణనము

తే. బొమ్మ యను పేరియగపాలె • పూఁటచెలిని, గోరి యలరించుటకుఁ జద • ల్గదుటఁ గాఁచి
నీట ముంచినమేటివ • న్నియపసిండి, పూఁదె యనఁ గ్రుంకెఁ గడలిలోఁ • బ్రొద్దు వ్రాలె.

తే. రేవెలందుకఁ బెండ్లాడ • రిక్కరాయఁ, డేఁగుదేఁ గలఁ డని వేల్పు • టిగురుఁబోండ్ల
గములు గట్టినక్రొత్తచెం • గలువతోర,ణము లనఁగ సంజకెంజాయ • లమరె మింట. 4

క. బలితంపుసంజకెంజా, యలు నిద్దపుమావిచిగురు • లని చేరి తమిం
గలయంగాఁ బర్వినకో, యిలమూఁక లనంగఁ గడల • నిరులు దనర్చెన్. 5

క. మరుఁడు దెరువరుల నెల్ల, స్వైరమునఁ దీర్పంగఁ గోరి • విరివిగఁ గతిదే
వరయడుగున నిడుమల్లియ, విరు లనఁగా రిక్క లెసఁగె • వేలుపుఁద్రోవన్. 6

క. తామరలు ముడిఁగె జక్కవ, చామలకు న్వేతలు పర్వెఁ • జక్కఁగఁ బదుపుం
గోమలులకు బోజుఁగులకును, సేమం బొనగూడె నపుడు • చెప్పఁగ నరుదై. 7

### చంద్రికావర్ణనము.

తే. తనర మగమానికపువాలు • దాల్పుజోదు, వేడుకలు మీఱ నాడుమే • త్సెడమీఁద
గొనబు మీఱెడునపరంజి • కుండ యనఁగఁ, దూర్పుగుబ్బలిపైఁ దోఁచెఁ • దొగలఱేఁడు.

నుఁగొలఁకునఁ బూచినన, క్కానిచెంగొవ యనఁగఁ దనరెఁ ♦ గలువలనొర లోఁ
న వర్యోఁ గప్పు మరి క, త్తినవేమక నుండుగండుఁ ♦ దేఁటి యనంగ౯. 9

ంతఁ గొఱంత యింత లేక ఱజగం బంతయు నిండి పిండి చల్లినతెఱంగునఁ బొంగారుచుఁ ఱపిలేక తఱపివెన్నెలలు గాయఁ దొడంగినం గడంగి నింగిముట్టిన వంతసంపుటగ్గలి ల డగ్గఱించి యొక్కమ్మడిఁ బొక్కుచు గ్రక్కున మెక్కి యామెక్కి యక్కజంపు పక్కవలం జొక్కి చిక్కక చక్కెరవిలుదాల్పుబవరంబులం దవిలి చెన్నారువెన్నెల పులుఁగులమొత్తంబులును వెన్నెలపులుఁగులమొత్తంబులబిత్తరంపుంబనులకు మెత్తఁ బడి కొఱ్ఱిత్తవగఁ దత్తఱించుచుం దమతమవేడ్కకత్తెల నత్తుకొని పూవుబొత్తుల ప్రేటు గాకుచు విచ్చలవిడిం దిరుగుబోజుంగులును బోజుంగుల సొక్కుడకుం బనిచి వగలం దగిలి మగల నెదిరించి కొంచక మంచిగందంబు లలఁది వలిపంపుఁ జెలివలువలు కునుంగు లిడి దొనంగు లత్తి వెసం గదలి యిక్కలకుం దాటుచెడిపజవరాండ్రం గని కమజవరాండ్ర సెవలం దలంచి యెల్లన నల్లంబులు దల్లడిల్ల నున్న రని సొమ్మసిలం బొఱుతెరువరులును దెరువరుల గెలువం దరలుమరునకుం దత్తి యనుకమ్మతేఁడు వెర వునం జేసి యయివిచినకఱకటమ్ములగుంపుల సొంపునం బెంపొదుకలువ క్రొవ్విరులును కలువక్రొవ్విరులపయి మునరి కొసరి తీఁగపసగలపూఁదేనె లాని పెల్లుగం ద్రుళ్లు గండుఁదుమ్మెదలును గండుఁదుమ్మెదలకొదలు చెవుల నాట బీఁట లగుజొందంబులతోడ గాటంపుమరునాటలకుఁ దివురుకొమరుంబాయంపుందుటారికత్తియలును దుటారి కత్తియలసిబ్బెంపుగిబ్బిగుబ్బల కెనయనం దగి సొంపు గలిగి వెతలొనర్చుజక్కవపెంటి కూటువలును జక్కవపెంటికూటువలపాటు గనుంగొని వెఱచి పొలయలుకలు మఱచి పఱచి మగల నిఱియం గౌఁగిలించికొనుముగుదపూఁబోఁడులును ముగుదపూఁబోఁడుల నిద్దంపుముద్దుమొగంబులకు దొరగానిసిగ్గునంబోలె ముడుంగఁ బాఱిన నెత్తమ్ములును నెత్తమ్ములకొలంకులం దలంకక దుంపమూండ్లు మెసవి విసువక కూఁత లిడుకొదమరా యంచబారులునుం గలిగి పుడమి యెల్ల మొల్లం బగుచల్లఁదనంబున నల్లసిల్లుచుండె నప్పు డాగొల్లరాకన్నియ యెన్నరానివలవంతలం బొరలుచుండె నట్టియెడ. 10

## నీలను మన్మథుఁ డేఁచుట.

ఇరువంకలఁ దన్నుఁ బొదవి, గొరవంకలుఁ దుమ్మెదలును ♦ గోయిలలుం ద
క్కరిచిలుకలుఁ బరిపులుఁగులు, గొరగొర రా మరుఁడు వెడలెఁ ♦ గొమ్మఁ గలంపన్

అట్లు వెడలి. 12

మ. కడిమిం జిల్కపిసాళిచక్కి నెదు ర ♦ క్కం జివ్వసం దోలి బ
ల్వెంచివింట న్ననవాఁడిపూములకు లో ♦ లిం గూర్చి బిట్టార్చి నె
వ్వడిఁ జేకొల్దిగఁ దీసి దాని మరుఁ డ ♦ వ్వాల్గంటిచన్దోయి నె
న్నడుచక్కన్ గురిచేసి యేసె నదరం ♦ టం గాఁడి పై పోలఁగన్ 13

చ. తలిరుజిరావజీరుబలు ♦ దాడికి నోడి కడంక దక్కి యు
క్కలుకమిటారి డెందమునఁ ♦ గొందల మందుచు నప్పు డెంతయు
న్వలపులవెచ్చ హెచ్చఁ జెలు ♦ వం బగునెమ్మెయిఁ గ్రాఁగి పోలుచు
ల్గళవళపాటులోఁ జెలిమి ♦ కత్తెల మాఱుచు నుండె వెండియున్. 14

సీ. తులువరాచిలుకమూఁ ♦ కలపాళెపాహలకుఁ, బాఁపమేపుడుఁబుల్గు ♦ బారుకొండకు
జమిలిముక్కాలిపి ♦ సాళిబల్ప్రోఁతకుఁ, గొదమకోయిలచాలు ♦ గోలగోలకు
గద్దఱిగోరవంక ♦ గములపస్పదులకుఁ, బొగరుటంచలపల్కు ♦ వెగటులకును
వలివాలిగాడ్పుబో ♦ దలహెచ్చరికలకుఁ, జలివెల్గునుదుటు వె ♦ న్నెలలసెగకుఁ
తే. దొడరి బడిబడి వెచవింటఁ ♦ గుడియెడమల
నదరి వడి నేయుకతివేల్పుఁ ♦ గొదుకుదుడుకు
టంపజడివానసోనల ♦ యలజడికిని
మిగుల నెద నోడి యాఁడు న ♦ మ్మించుఁబోఁడి. 15

## మన్మథదూషణము.

తే. అలరువిలుకాఁడ బలుసిరి ♦ గలిగినట్టి, దొరకొడుక నంచుఁ బొగరువఁ ♦ బ్రదుక్కొనుచుఁ
దెఱఁ గెఱుంగక ముగుదలఁ ♦ దెరువరులను, బూని యేతువె నీపూని ♦ బుగ్గిగాను.

క. పొరపొచ్చెంబునఁ బలుమఱు, విరిఁబోఁడుల నెల్ల మిగుల ♦ వెతవెట్టుదు నీ
దొరతనము ద్రుంగి పోవను, మరుఁడా నీచేతివిల్లు ♦ మంటం గలయన్. 17

చ. తలఁపఁగ ముజ్జగంబులకుఁ ♦ దల్లియుఁ దండ్రియు నైనలచ్చికిం
బులుఁగుహజుమావజీరునకుఁ ♦ బుట్టినదిట్టవు నీకు నెల్లరుం
గలయఁగఁ దోడఁబుట్టువులు ♦ గారె యయో యెన రింత లేక లేఁ
జిలుకలకొల్కులం గలఁచఁ ♦ జెల్లునె పెల్లుగఁ బచ్చవిల్తుఁడా. 18

ఉ. కన్నులవింటివాఁడ తిగ ♦ కన్నులదేవరతోడఁ బోరి ము
న్పన్నము నొంది మేఁ దొఱఁగు ♦ పట్టున నెక్కడ డాఁగి పోయె నీ

...తికంబు నేఁడు కొఱ ♦ మాలినకోయిలచిల్కమూఁకలం
...గఁ గూడి చేడియల ♦ బాములఁ బెట్టెదు పోటుబంటవై. 19

## చంద్రదూషణము.

...పుటామునం దమియఁ ♦ బర్వఁగఁ గైకొని యొజ్జముద్దియం
...నదోసకారి వని ♦ కాదె నిసుం గని తమ్మికొమ్మ ని
...ఁ దలవంచుచుండు నది ♦ చాలదొ యాఁడి నీకు నెంతకుం
...వల కోఁడ నీవపుడు ♦ నన్నము గా నిఁక నిందు రాకుమీ. 20

...లేని వెతలఁ ♦ గుందెడిముగుదల, డంకతనము మీఱ ♦ జంకు లేక
...మునఁ గలంచె ♦ దింకఁ జెన్నఁడు నీకు,వంక గల్గదోటు ♦ జింకతాల్ప. 21
...టా మున్ను ముక్కంటి ♦ కంటిమంట, చేత బూదైన మరునకుఁ ♦ జెల్లుఁ గాని
... మనిరెడు ననుకోర్కి ♦ నపరునీకు, జాడయే చేడియల నేఁచఁ ♦ జందమామ.

## వసంతాదులదూషణము.

...పు గలవాఁడ వంటను, జెలఁనల నలయింప నీకుఁ ♦ జెల్లదయో నీ
...వెల్లఁ జెల్లపాలుగ, నలరుజిరాజోదుజోడ ♦ యామని కోఁడా. 23

...నిపూపు గల్గుట, కతివలపైఁ బెల్లు రేఁగి ♦ యలజడి మీఱ
...పెట్టుదువే యిఁక నీ, బ్రతుకు బయల్గాను నాలి ♦ పయ్యరకుక్షా. 24

...న కొన్నాళ్లు పలుగాకి ♦ మూఁకలోనఁ, గలసి మెలఁగిన తెఱఁ గెల్లఁ ♦ గానిపింపఁ
...పలమీఁద గ్రుడ్లెత్తి ♦ సేయ రాకు, కోయిలా యింక నీయిల్లు ♦ గూలిపోను.25

...గాని పండ్లు గొఱుకుమఁ, జీ!కికిమాటికిని గసరు ♦ చిలుకం జిలుకా
...ల నలయించెదు నీ, గోటాపన యెన్నఁ డింక ♦ గూటం బడునో. 26

...బోఁడుల డెందము ♦ ల్లల్లడిల్లఁ, గూఁక లిడుకొంచు నెంతయుఁ ♦ గొఱఁతలేక
...డంబునఁ బురివిచ్చి ♦ యాడెదేమి, యక్కటా నెమ్మి నీయాట ♦ యడవిఁ గలయ.

...ఁ బలుమఱు మొరయుచుఁ, గమ్మనిపూఁదేనె లాని ♦ కడుఁ గ్రొవ్వి యహా
...ఁ గలఁపఁగఁ జూచెదు, తుమ్మెద నీతుల్లు పెద్ద ♦ తుప్పలఁ బట్టన్. 28

...పలుమఱుఁ జెవులు చీఁ ♦ దఱఁ గొనంగ, బిట్టు మొరసెదు వన త్రాగి ♦నట్టు లిట్టి
...జాడ లెట్టుగాఁ ♦ బట్టువడియె, బెట్టుగా నిన్ను వెనఁ జెఱఁ ♦ బెట్టియిడను.29

వ. అని మఱియు మఱియుఁ బరికించి చెలుకువలుకాని కలకలచులుకులరయములకు నేత్రంబులకు సంతసంతకు నగ్గలం బగువలవంతసెకలఁ గ్రాఁగి వేఁగి సైఁప రాకున్న డిల్లపడి మెల్లన సొమ్మసిల్లిన. 30

## చెలికత్తెలు నీలకు శైత్యోపచారంబులు సేయుట.

క. చెలు లెల్లఁ దల్లడిల్లుచు, వలగొని దరి నిలిచి యకట • వలవంతసెకల్
బలు వయ్యెఁ గలికిఁబోఁడికి, వలిపను లిఁక నరగఁ జేయు • వలె నని మఱియున్. 31

ఆ. కప్ర పటాఁడి మంచి • గందంబు మెత్తి పన్నీరు చిలికి తూండ్లు • నించి వలపు
గ్రమ్ముపూలవిసన • కట్టచే వీచుచుఁ, జివురుసెజ్జమీఁదఁ • జేర్చి మఱియు, 22

తే. ఎన్ని రానట్టిచలిపను • లెన్నియేనిఁ, జేయు మే లందులను లేక • సేగిఁ బొందు
చున్నకన్నియ మెల్లన • నన్ను రనుచుఁ, గొరలి యిట్లని పలికె న • బ్బురము మీఱ.

సీ. నిద్దంపుఁబాన్పుపై • నిప్పులకునియలు
నింపఁ జెల్లునె మీకు • నెలఁతలార
రొదసెడ వినము గ్ర • క్కొడుపాములను సొడఁ
గూర్పఁ జెల్లునె మీకుఁ • గొమ్మలార
కళపెళ నుడుకుచ • క్కనినూనియల్ మీఁదఁ
జిల్కఁజెల్లునె మీకుఁ • జెలియలార
మేనఁ బొక్కులు పొక్క • మెదియించి సున్నంబు
మెత్తఁ జెల్లునె మీకు • మెలఁతలార
తే. కటకటా నేఁడు పగ దీఱ • నిటులు గలఁప
వలయునే యంచుఁ బలుమఱుఁ • గలవరించు
నలరులను దూండ్లఁ బన్నీరు • వలపు గలుగు
చలువసిరిగంధమును గాంచి • కలువకంటి. 34

ఆ. చానలార యిపుడు • జంటారుమేనులు, దాల్చి మిగుల సెగలఁ • దలర నెండ
గాయ సాగ నేమి • గాముల కేఁ డని, చెలువ మిగుల నలుకఁ • దలఁకి పలుక,

## నెలఁతలు మన్మథపూజ సేయుట.

ఆ. అట్లు గళవళించు • నళినను గనుఁగొని, యనుఁగుఁజెలులు వెఱచి • యహహ వలపుఁ
గాఁక బలిత మయ్యెఁ • గ్రాల్గంటి కిఁక మరుఁ, గొలువ కున్న మేలు • గూడ దనుచు,

గా త్తవిరిగంద • మునఁ దిన్న యొనరించి, చెలువుగొజ్జఁగనీటఁ • గలయ నలికి
న్న లలరఁగ • బ్రవుముగ్గులను బెట్టి, పన మించుచెఱకుఁగం • బములు నిలిపి
పుమల్లెత్రా • వ్విరులపందిరి ప్రేసి, తళుకుగేదఁగి రేకు • దళ్లు గట్టి
ఁ జెంగల్వలఁ • దోరణంబులు గట్టి, మేలిముత్యాలజా • లీల నుంచి

మిద్దె గద్దెపైఁ • గమ్మవిల్తు, నిమ్ముగా నిల్పి యొమ్మెను • గొమ్మ లెల్లఁ
గావి పెక్కులాగుల • దొమ్మిగూడి,పూజలొనరించి యిట్లని • పొగడి రవుడు.

క్కిదము నీకుఁ జక్కెర • లుక్కుటిలున
నిక్కుచు మిక్కిలి • చొక్కుతొగరు
బల్వక్కిజక్కిపై • నెక్కి జగము
మెఱయుంగ గెలుచుచు • నుండుజోద. 38

మ్మెదలు నాలివలి • తెమ్మెరలుఁ గోయిలల•దిమ్ములును జిల్కలును•నెమ్మిగములు న్గా
ఁ బోరింబోరిని•గ్రమ్ముకొని గొల్వఁ జెలఁ•వమ్మున బయల్వెడలి • కమ్మనగువింటం
మ్ముల్కి బెడి • దమ్ముగ నమర్చి వడిఁ•జిమ్మి కడిమి న్మగల • నిమ్ముగను బొమ్మల్
కరఁగించుచును•గొమ్మలను గూర్చునిను•నెమదిని గొల్తుము తి•ర మ్మయినబత్తిక్

యుఁడ నీబెడిదవు, టలరుంబూవులకు వెఱతు • రఁట నల్వయుఁ గ్రొ
గొల్పను నిఁకఁ బెఱవా, రలఁ గలఁచుట యేమి యబ్బు • రం బరయంగన్.
ము న్వాలారుం, గోలలఁ బరఁగించి మరులు • గొల్పుచు మిగులం
చుట కెఁకఁ దాళం, జాలము నీయాన యోమె • నలిడాల్వేల్పా. 41

నుఁగు లెల్ల నిత్తెఱఁ, గున వెపవిల్కాని వేఁడు • కొన నవుడాత్రో
గోఁడి కొంతడెందం, బున వెత చల్లారఁ దాల్మి • పారయుచు నుండెన్. 42
43

## ప్రభాతవర్ణనము.

లు గూసె జక్కవలు • పొందుగ డాసె బొజుంగుమూఁకకుం
లు వాసె రిక్కగమి • పోఁడిమి మాసెఁ బిసాళితుమ్మెదల్
ల మ్రోసెఁ జేఁకటులు • గొబ్బున మాసె మరుండు తుంటవిల్
నక్కఁ దీసెఁ దొగ • పైదలియుం గను మూసె నంతయున్. 44

ంగ తమ్మి • విరిఁజోఁడివగకాఁడు, చదలుమానికంబు • జగముకన్ను
లు పివము • వేఁటూడుపోటరి,ప్రొద్దు తూర్పుమలను • బొడమె నవుడు. 45

తే. తెల్లవాఱుట గన్గొని ♦ యెల్లవారు, గొల్లవారింట వేడ్కగ ♦ న్గొనఁగ నలరు
నంచు మేల్కాంచి తఱిచెయ్వు♦లన్ని దీర్చి, గీము లలరించుకొనిరి కో♦ర్కి యెలరఁ జెలంగ.

## గొల్లదొర తనపట్టుల నలంకరింప నియోగించుట.

ఆ. అపుడు గొల్లనాయఁ ♦ డందంబుగాఁ దన, పట్టు లలరఁ జేయు ♦ నట్టుగాను
నేర్పు గల్గువారి ♦ నేర్పరించినఁ జాల, చెలిమితోడ వార ♦ లెల్లఁ గడఁగి. 47

సీ. తెలిముత్తియపుఁ బంది ♦ రుల మేల్లైనల నిల్పి, నలు వొప్పఁ దొగదోర ♦ ణముల గట్టి
ముంగిళ్లఁ గపురంపు ♦ మ్రుగ్గు లిమ్ముగఁ బెట్టి, తనరుగోడలను జి♦ త్తరువు దిద్ది
పసిఁడితిన్నియల సొం ♦ పెసఁగఁ గస్తురి యలికి, క్రంతలఁ బన్నీరు ♦ గలయఁ జల్లి
పట్టుఁబుట్టములమే ♦ ల్కట్టు లమర్చి కీ, వివి బయళులను గొ ♦ ల్లెవలు వన్ని
తే. మఱియు దరిలేనిసొగసు లే ♦ మఱక చేసి, పలుదెఱంగుల వాయిద ♦ మ్ములు చెలంగ
నిగురుఁబోఁడులు మగవాండ్రు ♦ వీనులేక, యరిదిసింగారములు పూని ♦ యలరి రంత.

## కుంభకునిపురికి గొల్లలు వచ్చుట.

సీ. కిఱ్ఱుచెప్పులు గొప్ప ♦ గీఱునామంబులు, మొలచెక్కుకత్తులు ♦ నిలువుసిగలు
కుడిముక్కుగ్రమ్ములు ♦ గురివెందపేరులు, పిల్లఁగ్రోవులు మేటి ♦ వల్లెత్రాళ్లు
లోరుగట్టుపంచెలు ♦ వెరసుఁబచ్చడములు, గాజొన్నలోవంక ♦ కఱ్ఱిరొండట్లు
గుండపోఁగులు చిప్ప ♦ గొడ్డళ్లు చెలగోల, లొప్పారు పలువంక ♦ యుంగరములు
తే. గలిగి గాటంబుగా నెల్ల ♦ కడలనుండి, పెల్లు మీఱఁగ గిబ్బల ♦ పీఁచ మడఁచి
కోర్కు లిగురొత్తఁ గన్నఁ జే ♦ కొనెద మంచు, మొల్లముగఁ జేరి రపటికి ♦ గొల్లలెల్ల.

వ. అట్లు చేరినవారి కెల్ల గొల్లదొర యుల్లంబులు దనియ సోగిరంబులు వేగిరంబునం
బెట్టించి వీడెంబులు గందంబులుఁ గోకలుం దొడవులు నిడి విడిపట్టులను నిచె నంతకు
మున్న పనిచినమానిసివలన నత్తెఱం గంతయు విని నందుండు యశోదయుఁ దాటి
నిసంబుజోదును బుత్తడిదువ్వలువవాల్పును బయనం బయి కదలి ప్రోల్కడనక్కి-
స్వచ్చుచుండి రయ్యెడ. 50

## నందాదులు కృష్ణునితో వచ్చుట.

తే. పిటఁ గట్టినవాఁడెంపు ♦ బోటు లెల్లఁ, గూటువలు గూడి జన్నంపుఁ ♦ గూటిదొరల
మాటకయి మేను పూనిన ♦ మేటివేల్పుఁ, దేటగాఁ జూచుకోర్కెన ♦ చొప్పటఁ జేరి.

పో యేప్రొద్దు ♦ ప్రేమల్లెలో గొల్ల, మగువల వలపించు ♦ సొగసుకాఁడు.
పో చెలరేఁగి ♦ విసవుఁబా లిడుటాఁగ, రక్కసిఁ దునిమిన ♦ యుక్కుఁదునియ
పో నందుని ♦ విరిఁబోఁడియుందవ, మొనసి చిందులు త్రొక్కు ♦ ముద్దులాఁడు
పో బండితో ♦ ర్వేలుపు నుంకించి, పిండిగాఁ దన్నిన ♦ దండిజోదు
పో త్రేఁగిముల ♦ వెన్నజున్ను, గములఁ గొల్లగ మెక్కిన ♦ గండిదొంగ
చ నసువుచుఁ దలిముత్తి ♦ యంపుసేనఁ, బాళ్ళు చల్లికి వేడుక ♦ ల్బయలువడఁగ.

మ కుంభకుఁ డెదురుగా ♦ నరుగుదెంచి, యక్కకును బావకును మ్రొక్కి ♦ తక్కువారిఁ
కటను గూర్చి వేడుక ♦ ల్గడలుకొనఁగఁ, దనమనికిపట్టునకుఁదోడు ♦ కొనుచు నేఁగి.

కకును బోనమ్ములు, గంధమ్ములఁ దమ్ములములఁ ♦ గడునడి నిడి తా
బుగ డెందంబున, ముం దెన్నఁడు లేనియెలమి ♦ మురియుచు నుండెన్. 54

## కృష్ణునిరాక నెఱిఁగి యాఁబోతులు విజృంభించుట.

ఘ కల్లరి ♦ యాలపోతులు పైఁడి,వలువదా ల్పచటికి ♦ వచ్చు టెఱిఁగి
తో రెచ్చి దొ ♦ డ్డిని గల్గుచూఁడ్పాఁడి, మొదవుల లేఁగలఁ ♦ బొదివి చాలఁ
లఁ గ్రుమ్మి లేఁ ♦ గోడెల నెల్లను, దఱుపుల నెత్తురు ♦ నెఱయఁ బొడిచి
లు గ్రోడాడి ♦ కోవెలల్ నుగ్గాడి, పందిళ్లు పడఁద్రోచి ♦ బండ్లు విఱిచి
ృలు పగిల్చి గుడిసెలు ♦ దళ్లుఁ గూల్చి, గొల్లవాడల నెల్లగ ♦ గ్గోలుపుట్టి
సవాండ్రను గుబ్బల ♦ నంతమందిఁ, గడఁగి తఱుముచు నెనలేని ♦ కడిమిఁ జూపె.

ఁ దెల్లవాఱుటయు నయ్యాలు తోఁ డెల్లగొల్లకొమరులఁ బిలిపించి తనముద్దుఁబట్టిని
ము సింగారించి తెచ్చి ముందర నునిచి యందఱు విన నిట్లనియె. 56

## బట్టువానికి నీల నిచ్చెద నని గొల్లలతోఁ గుంభకుఁడు చెప్పుట.

వార చెడుగుఁ ♦ గోడెలఁ గంటిరె,జగము లెల్ల గ్రమ్మిఁగఁ ♦ జాలుకడిమి
గుచున్న వెన్న ♦ నివి బొబ్బమెకములో,పులులో యడవియేనుఁ ♦ గులో నిజంబు
లనఁ జాల ♦ వెతఁ గుందితిమి నేల, తోఁడు కినుక చేసి ♦ వేఁడి నూప
ఁ బెక్కు మాట ♦ లేటికి వినుఁ డిద, నిక్క మైనదిట్టు ♦ లొక్క పలుకు. 58

ు దలిర్పఁగ నీగి, బ్బలఁ బట్టఁగఁజాలు నేరు ♦ వరి కివు డిత్తుం
వముల ప్రోక యగునీ, తలిరాకుఁబోఁడి నెమ్మి ♦ దళు కొత్తంగన్. 59

క. అనిన విని గొల్లకొమరులు, ననఁబోఁడులమిన్నఁ గైకొ • నఁగ వలసినబ
ల్పను గోడెల గెలువఁగ నెం, వనిజడుపును గల్గి కాదు • పడి యుండె రొగిన్.

## ఘోషవంతుఁడు కోడెలచేఁ జిమ్ముఁబడి సొమ్మసిలుట.

వ. ఆరయిన ఘోషవంతుం డను నొక్కగొల్లకొమరుండు. 61

క. గిబ్బల గెల్చుట యిది యొక, యబ్బురమా యనుచు బింక • మాడుచు నపుడే
గొబ్బున లేచి భుజంబులు, దబ్బునఁ జఱచుకొని బల్లి • దపుదిట మెసఁగన్. 62

తే. తొడరి యుష్మేటి యాలపో • తులను డాసి
పట్టుకొనఁ బోవుటయు నవి • బిట్టు గినిసి
కన్నులను నిప్పు లొలుకంగఁ • గడఁగి వానిఁ
బొడిచె నన్నియుఁ • పఱు • చెదరి పఱవ. 63

క. ఆటువలెఁ బొడిచినఁ గనుఁగొన్నదిట మింతయు విడక యతఁడు • దీటుగఁ గదు మం
దటికిఁ జని యొక్కపోతును, దటుకునఁ బిడికిటను బొడిచెఁ • దలనదుచక్కన్. 64

క. పొడిచిన నన్నియు నొక్కు, మ్మడిఁ గడిమి దలిర్ప నతని • మార్కొని కినుక
న్నిదుదమొనవాఁడికొమ్ములఁ, బుడమిం బడ వైచి పొడిచి • పోరిఁ బోరి మట్టెన్.

ఆ. మట్టి మిగుల నలుక • రెట్టింప దవ్వగాఁ, జిమ్ముటయును దూలి • సొమ్మసిల్లి
పడియె నతఁడు గిబ్బ • పదు వంత గొల్లల, కైకి నుతికి కడిమి • బలిమి రాయ. 66

ఉ. కొందఱుఁ బూని కొమ్ములను • గ్రుమ్ముచుఁ గొందఱు గ్రమ్మఁ ద్రొక్కుచుం
గొందఱుఁ బెందొడల్ విఱిగి • కో యని యార్వఁగఁ గూలఁ దన్నుచుం
గొందఱు నేపుతోఁ దఱిమి • గుట్టలమెట్టలపాలొనర్చుచుం
జిందఱవంద లై పఱవఁ • జేయుచు గాటపులావుఁ జూపుచున్. 67

## కృష్ణుఁడు బలరామునితో నక్కోడెలకత తెల్పుట.

క. అప్పగిదిఁ బఱచువారలఁ, దప్పక చూచుచును మోముఁ • దమ్మిని జెఱువ
న్నొప్పార నపుడు వెన్నుఁడు, కప్పంబుట్టంబువానిఁ • గని యిట్లనియెన్. 6

తే. అలపోతులు గా విని • కాలనేమి, కొడుకు లేడ్వురుఁ దనచేత • మడిసి తొంటి
మూడుఁ దీర్పఁగఁ బూని యి • చ్చోటఁ బుట్టి, రిపుడు వీరి నడంచెద • నేపునూపి.

వగతుఁగ నవఁ చుటయుఁ బం, దుగులం గాపాడుటయును ♦ దోరం బరయం
బగఁ గంటి కైన నిది కడుఁ, దగిలినమే ల్గాద యిప్డె ♦ దం బరికింపన్. 70

## కృష్ణుఁడు కోడెలఁ బైకొని చంపుట.

అని పలికి వాని కెదురుగఁ, జనియె నపుడ వేలుపులును ♦ జడవారులు నిం
గి నిలిచి కనుఁగొనుచుండఁ, దన కెంతయు మేలుగోరి ♦ తద్దయుఁ బొగడన్. 71

చని యటఁ బసరపురక్కసు, లను బయికొని దోనకారు ♦ లారా కడుఁగ్రొ
వ్వునఁ గలఁచితి రిన్నాళ్లును, బనివడి జగమెల్ల నింకఁ ♦ బఱవక నిలుఁడీ. 72

కల్లరు లై పెల్లావలఁగఁ, బొల్లఁ గొల్లలను బాఱఁ ♦ బోడుచుట గా దిం
కెల్ల తెఱంగుల మిమ్ముం, జెల్లించెద వేల్పుగములు ♦ చెలఁగుచు నుండన్. 73

అని యదలించి పలికిన నులికి యలుక రెట్టింప నద్దబ్బుఱగిబ్బరక్కసు లేడ్వురునుం దొంటిరొంటుమి మేటిపెనంకువం జెంగున నెగసి యుక్కున నొక్కుమ్మడి నతనిం దాఁకిన నబ్బలుమగండు గండు మీఱి లేగున్నయేనుఁగులపయి దాఁటుసింగంబు తెఱంగునం గదిసి యఱచేత మోరలు చఱచియుం దటిమి యురవడిఁ గొమ్ముల మొదల నులిమియుఁ దొడలు విఱిచియు నడుము లవియం బిడికళ్లం బొడిచియు వీఁపులు మూఁపురంబులు నడిచియు నెత్తురులు జొత్తిల్లం జేసియు మఱియుం బెక్కులాగుల నొప్పించియుఁ జూపఱచూడ్కికి వేడ్కగాఁ గొంతదడవు గడపి యంత. 74

పిడుగున కెన యనఁ దగుతన, పిడికిట నొక్కొక్కదాని ♦ బెడిదంబుగ నె
న్నడి నెత్తు లవియఁ బొడిచిన, వడి నొక్కొక్కటియు నేల ♦ వ్రాలెం గోడెల్.

అట్లు లొక్కొక్కపోటున ♦ నాలపోతు, లన్నియును వాత ముక్కునఁ ♦ గన్నుఁగవల
నెత్తురులు గాఱ నీలిగి ♦ నేలఁ బడిన, నెల్లవారలు వెఱఁగంది ♦ రుల్లములను. 76

## దేవాదులు మెచ్చి తత్సూచకముల నెఱపుట.

ఆ త్రతి వేలుపు ♦ లాకసంబున నుండి, వెన్నునిపయిఁ జాల ♦ విరులవాన
గురియింప నచ్చర ♦ ల్గామ రొప్ప నాడిరి, గొల్లకెలం ల్లందఱు ♦ నుల్లసిలిరి
నందుండు గొమరునిఁ ♦ బొందుగాఁ గౌఁగిటఁ, బెనఁచి తద్దయును దీ ♦ వన లొసంగెఁ
గుంభకుఁడును దన ♦ కోరిక యీడేఱె, నని చూచి సంతసం ♦ బునఁ జెలంగె
. నీలయును జాల వ్రేతల ♦ మేలువాఁడు, తనకు మగఁ డయ్యె ననుచు డెం ♦ దమున నుబ్బె
మఱియుఁ జూపఱు లెల్ల నే ♦ మఱును మెచ్చి, పొగడు చుండిరి వెన్నుని ♦ మగతనంబు,

## నీలకుఁ గృష్ణునకుఁ బెండ్లి వర్తిల్లుట.

ఆ. అంత గొల్లపెద్ద ♦ లందఱు నీలకు, వెన్నునకును బెండ్లి ♦ వేన వేడ్క
వలయు నంచుఁ బూని ♦ వల నొప్ప మూరుత, మెల్లఁజూపనయ్యె ♦ నొయ్య నడిగి. 78

ఆ. కాళ్ల గోళ్లు దీసి ♦ కన్నియకును బెండ్లి, కొమరునకును దలలఁ ♦ జమురు రాచి
నలుఁగు లిడఁగఁ జేసి ♦ నలువొప్ప నయిరేని, నీరుపోసి రపుడు ♦ పేరఁటాండ్రు.

క. తొగనూడు గ్రుంకె దట్టం, బుగఁ జీఁకటు లొదవె రిక్క ♦ లొత్తము వొడమెన్
లగనమును డాసె నిర్యోషఁ, దగఁ బెద్దలు నైదువలును ♦ దద్దయు నెలమిన్. 80

తే. పలు తెఱంగుల వాయిద ♦ ములు చెలంగ, కిరితో సల్లడల దివ్వె ♦ టీ ల్వెలుంగఁ
గన్నియను బెండ్లి కొమరునిఁ ♦ గడఁగఁ బెండ్లి, తిన్నె మీఁదికి మెల్లనఁ ♦ దెచ్చి నిలిపి.

తే. పుడమి వేల్పులు దొలి పల్క ♦ నుదుటు లెలమిఁ
జదువుకొంచును దీవనల్ ♦ చాల నొసఁగి
సేసఁబ్రాల్ చల్లి వలిపంపుఁ ♦ జీర యొకటి
చెలఁగి తెరవట్టి కాల్ద్రొక్కఁ ♦ జేసి రపుడు, 82

ఆ. చాల వేడ్క లొదవఁ ♦ గేలుఁదమ్ముల నంటి, గ్రైదువలు కడంక ♦ నంది యిడఁగ
వెన్నరానికూర్మిఁ ♦ గన్నియయటుతను, గట్టుతాల్పు తాళి ♦ బొట్టుఁ గట్టె. 83

క. వెన్ను నితలపైఁ గన్నియ, కన్నియతలమీఁదఁ బట్టుఁ ♦ గైదువుకోదుల్
సన్నపుముత్తెము లెలమిని, మిన్నక చేనూండ్ల నించి ♦ మించిరి మిగులన్. 84

క. చీరచెఱంగులు ముడి యిడి, కూరిమిఁ జిటికెనలు పట్టి ♦ కొనఁ గూరిచి తా
రారంజోతిని గడు నిం, పారఁగ మ్రొక్కించి రప్పు ♦ డారిన్ మగనిన్, 85

## కృష్ణాదులకుఁ గుంభకుఁడు కట్నంబు లొసంగుట.

సీ. అయ్యెడ గొల్లఱేఁ ♦ డల్లున కెలమితో, ముత్తెంపుఁజొకట్లు ♦ మురుపు లుంగ
రములు నేవడములు ♦ రతనంపుఁబావలు, గొలుసులు పదకముల్ ♦ జిలుఁగుఁజేల
లందలా లడపంబు ♦ లపరంజిగిండులు, జాలవల్లికలును ♦ జందువాలుఁ
బట్టెమంచంబును ♦ బఱపును శాలీనుఁ, జందుగుపెట్టెలు ♦ మందసములు
తే. గద్దెపీఁటలుఁ గపురంబుఁ ♦ గస్తురియును, శాఁడిమొదవులు మేలైన ♦ బత్తెయులును
నూడిగీలును వరవుల్లు ♦ నాఁడె మైన, మంచిగందంపుఁదున్కలు ♦ మించ నొసఁగె.

తే. కూరిమిని వీరకానికి ♦ వీరకత్తి, యకును దొలువేల్పుగొంగయ ♦ న్నకును మఱియుఁ
జుట్టముల కెల్లఁ దొడవులుఁ ♦ బుట్టములును, గట్నము లొసంగెఁ గట్టలు ♦ గాఁగ నపుడు.

తే. జన్నిగన్నకు బట్టకు • వెన్నరాని, పైఁడికట్నంబు లొసఁగి క • ట్నంపుఁగూరు
వరులకును గాణలకుఁ బెద్ద • బాఁపలకును, లెక్కసేయక చీరలు • నొక్కమిడిరి.

## నీలాకృష్ణుల నెక్కటిసేయుట.

వ. ఇత్తెఱంగున నెల్లవారలు నలరునట్లుగాఁ బెండ్లి యొనర్చి యంత నెక్కుమంచి మూరుత
మున నాల్గగల నెక్కటిసేయఁ దలంచి ప్రౌఢలగు నైదువరాండ్రం బనిగొల్పిన వారు
నయ్యెడ. 89

సీ. పగడంపుఁబనికినల • పట్టెమంచము దోమ, తెర వివరాదిక్రో • వ్విరులపాన్పు
సురమాలిబాలీసు • నూతినిగవుసెన, జరబాజు దందువా • సాన పీఁట
కపురంపుబరణి చి • ల్కలదివ్వెకంబంబు, నిల్వుటద్దంబు ప • న్నీటిక్రోవి
జవ్వాదిపక్కణి • జాలవల్లిక పైఁడి, వీణె దువ్వెన వట్టి • వేళ్లసురఁటి

తే. తమ్మపడిగము మంచిగం • దంపుఁగోర, పచ్చికస్తురిపెట్టె సం • పంగెనూనె
గిండులును గల్గి కన్నుల • పండుగైన, పచ్చరాకట్టుగొనబుటు • ప్పరిగలోన. 90

ఆ. పెండ్లికొడుకు నిలిపి • బిఱబిఱం గన్నెకు, సొగసు దిద్ది వేక్క • లిగురుబొత్తఁ
బడకయింటికడకుఁ • బరుగునఁ దోడ్కొని, చనుచుఁ బల్కి రపుడు • సకియ లెల్ల.

తే. చెలియ మును నీవు గోరిన • చెలువుఁ డిప్పు, డించువిల్కాని పని కెప్పు • డెప్పు డంచుఁ
దివురుచున్నాఁడు పడకింటఁ • దవిలి తమిని, బ్రొద్దు జరుగకు మిఁకఁ జాల • ముద్దరాల.

క. అగ్గలపువలపునను మును, బెగ్గడిలుచు నుండి యిపుడు • పెనిమిటితోడన్
డగ్గఱఁ బోయినయప్పుడు, సిగ్గటికిఁ బొడమె నమ్మ • చిత్తరుబొమ్మా. 93

సీ. ముకుద రమ్మని డాయ • మగఁడు చీరినయప్డు, కదియక మార్కలం • గొదవుసుమ్ము
మగఁడు మొరకొంగుఁ • దిగిచి సెజ్జకుఁ బార్వ, నడిగొట్టి వెనుకకుఁ • జనెదుసుమ్ము
వెన్నుఁడు కపురంపు • విడెయం బొసంగిన, మొదిఁగి కైకొనక యుం • డెదవుసుమ్ము
చెలువుండు పర్యోదఁ • దొలఁగింప గమకింపఁ, గేలు మాటిడి పెనం • గెదవుసుమ్ము

తే. సొగసుకాఁ డెదఁ గదియించి • జంటిమోవి
గంటి యొనరించి యిక్కువ • లంటి తుంట
వింటిబలుదంటపనులు గా • వించినపుడు
కడఁగి మెలఁగంగవలెఁ జుమ్ము • కలువకంటి. 94

క. దేఁగ తెఱుంగున బిఱబిఱ, సాగవలదె చెలియ వలపు • నడిరేని దపా
ళా గారుఁ గాఁపురం బిటు, బా గేటికిఁ బోదగదమ్మ • చక్కెరబొమ్మా. 95

సీ. తన వయ్యో బిఱబిఱ • నడవరాదె యటన్నఁ, జెలిమీఁదఁ గన్నెఱ్ఱ • చేసె దేమి
సెన రొప్పఁ జెంగట • నిలిచి పిడికొప్పు, దిద్దుకొన్నను బోఁడిఁ • దిట్టె దేమి
కడఁకతో వెలియాకు • మడుపు లెమ్మను జేతి, కొనఁగడితొయ్యలిఁ • గసరె దేమి
నగుచు గంధము దెచ్చి • మగని కలందు మన్నను బండ్లు గొఱుకుచుఁ • గినిసె దేమి
తే. వాలుఁగంటిరో యిటువంటి • వారె కారె, పొక్కి పెనిమిటికౌఁగిటఁ • దక్కి పెనఁగి
పెక్కుదెఱఁగుల రాచిల్క • జక్కిజోదు, ననల గడిదేఱి ప్రౌఢ లై • తనరువారు.

క. ఓకలువకంటి మును మముఁ, బైకొని బతిమాలి మగని • పజ్జ కిపుడు దే
రా కుండెదు సిరి వచ్చిన, పోఁకా లడ్డం బిడియెదు • మురువు దలిర్పన్. 97

ఆ. అనుచుఁ బలికి కలికి • నర్మిలిఁ దోడ్కొని, పడకయింటి కరిగి • పడఁతు లపుడు
మగువచేతివిడెము • మగనికి మగనిచే, విడెము ముద్దుఁజెలికి • నిడఁగఁ జేసి. 98

క. చెలువుగ నీ కిపు డబ్బె, న్నలువుగ నీతక్కుఁగుంద • నపుబొమ్మ యిఁకం
దలఁపునఁ గలిగినతెఱఁగున, మెలఁగుఁడు వలపులు దలిర్ప • మెలఁతయు నీవున్. 99

ఆ. గోలగాని మిగుల • గాశకురాలు గా, దింతి నీకుఁ దక్కె • నంత వేగి
రంపుఁబనులవలని • రాయిడి పెట్టక, ముద్దుగుమ్మ నెమ్మి • దిద్దుకొమ్మ. 100

తే. చెప్పవలసినలాగునఁ • జెప్పినార
మింతె కా కిపు డెన్న మీ • కిరువురకును
గలుగుమూర్తులు గనుఁగొన్నఁ • దెలిపినట్లు
మెలఁగుదురె యంచు నగుచు న • మ్మెలఁత లరుగ. 101

క. వెన్నుఁడు చిఱునవ్వునఁ దగఁ, గన్నియఁ జేపట్టి వలపు • గ్రమ్మఁగ సొగసుం
గ్రొన్ననసెజ్జకుఁ దారిచి, వన్నియ దిద్దుచును మిగుల • వలపు దలిర్పన్. 102

సీ. తెలిముత్తియపుసరుల్ • దిద్దునెపంబున, గిబ్బచన్నుఁగవలఁ • గేలఁ జెనకి
చెవులకమ్మలు చక్కఁ • జేయుజాడల ముద్దు, చిప్పిల నిద్దంపుఁ • జెక్కు లంటి
మొలనూలు సవరించు • వలనుగఁ గన్పట్టి, వలుఁదపిఱుఁదుఁ బొ • క్కిలియు నిమిరి
కపురంపువిడె మొసం • గఁగఁబోవులాగున, మొనసి చక్కెరమోవి • ముద్దులాడి

తే. పువ్వుఁబొత్తులం దుఱికెండి ♦ పాలు వెలర్పఁ, గప్పుమీఱిన బలితంపుఁ ♦ గొప్పు ముట్టి
మెల్ల మెల్లనె యొక్కింత ♦ మెలఁగ డెంద, మించువిలుదాల్పు చెయ్యూల ♦ కియ్యకొల్పి.

చ. కులుకుచుఁ దద్దయుం న్మదిని ♦ గూర్మి దలిర్పఁగ ముద్దు చిల్కుచుం
బలుకవ దేమి యొన్మె యని ♦ బాగుగ గంద మలంద వేమి కో
ర్కులం జెలఁగుఁగఁ గౌఁగిటను ♦ గూర్ప వ దేమిచలంబొ నానరో
చిలుకలకొల్కి యి ట్లైరవు ♦ సేయఁగ నే సొకలాఁతివాఁడనే. 104

ఆ. చిన్ననాఁటనుండి ♦ పెనఁగుచు నాపయిఁ, గన్నె నీకు వలపు ♦ గలదు కదవె
చేరి వేఁడుకొనినఁ ♦ జిక్కులు పెట్టెదు, తాళరాదె యింకఁ ♦ దలిరుఁబోఁడి. 105

సీ. పరువంపుమారేటి ♦ పండు లెచ్చుటఁ గన్నఁ, జెలి నీదుకులుకుగు ♦ బ్బలె తలంచి
డంబారు నెమ్మిపిం ♦ చెంబు లెచ్చుటఁ గన్న, ననఁబోఁడి నీదువే ♦ నలియె తలఁచి
తిరమొందఁ దేనియ ♦ పెర లెచ్చుటను గన్నఁ, దెఱవ నీతొఁగరువా ♦ తెఱయ దలఁచి
బెవరి పాలెకులేటి ♦ కదువు లెచ్చుటఁ గన్నఁ, గలికి నీసొగసుఁగ ♦ న్గవయె తలఁచి,
తే. నిచ్చ నిచ్చలుఁ గానలోఁ ♦ జొచ్చి మిగుల, నెచ్చరికల మెలంగుచు ♦ నిచ్చలోనఁ
గలఁగుచుండెద నెనలేని ♦ వలపు మీఱ, నింతి యిఁక జాగువలదు న ♦ న్నేలు కొనుము, 107

వ. అని నేర్పు దలిర్పం బలికి.

చ. జలఁగుఁబయుంట నూడ్చి మనుఁ ♦ జెన్నుటొయారపుఁజన్నుదోయిపైఁ
గలప మలంది వాల్జెడకుఁ ♦ గన్నులు మూసిన నవ్వుకొంచుఁ బొ
క్కిలి వలకేల నంటి గిలి ♦ గింతలు గొల్పుచు మోవి యానుచుం
గలికిఁ గరంగఁజేసి బిగి ♦ కౌఁగిటఁ జేర్చుచు వెన్నుఁ డత్తటిన్ 108

తే. మఱి రమ వెఱఁ గొప్పుచెలువంపుఁ ♦ దెఱఁగుపనులఁ
గరఁగఁజేయుచు నమ్ముద్దుఁ ♦ గలువకంటిఁ
గలసి యెనలేని నెమ్మదిఁ ♦ జెలఁగు చుండి
గుడునువాల్దాల్పు రేయెల్లఁ ♦ గడపి యంత. 109

## నందాదిసహితుఁడై కృష్ణుఁడు నీలతోఁ దలపల్లె చేరి సుఖించుట.

తే. అత్తమామలయానతి ♦ యంది తోడఁ, దల్లిదండ్రులు నన్నయుఁ ♦ దవిలి రాఁగఁ
గుందనపుటందలములోనఁ ♦ గొమ్మ నిలిపి, యుల్లమునఁ బొంగుచును దన ♦ పల్లె కరిగె.

క. అరిగి తననగరిలోనికి, నరగునఁ జొత్తెంచి యపుడు ♦ నంగడికాంద్రం
బేరిమె గలపెద్దలను గని, యిరవుగ మన్నించి చాల ♦ నెమ్మె దలిర్పన్. 111

ఆ. అంత నీలఁ గూడి ♦ యింత యంత యనరాని, సంతసంబు మీఱ ♦ జగము లెల్లఁ
గ్రోచుకొనుచు నెపుడుఁ ♦ బులుఁగుడాల్వేలుపు, కలఁకు లేనిసిరులఁ ♦ దనరుచుండె.

వ. అని నిరాహారిసింగంబుల కెల్లఁ గత యొఱింగించిన వారలం కొలంది లేనివేడుకలం దనరుచుండిరి. 113

ఉ. రిక్కలం మించు నద్దమును ♦ రేవొరయుం గపూరంబుఁ బొలుపం
జక్కెర రాచపుల్బిలువ ♦ సామియుఁ జిందముఁ దూఁడు మేపుదం
బక్కిగముల్ జగానలుప ♦ పట్టియు జొబ్బమెకంబు వేల్పురా
జక్కిరయు నీడు ప్రాలినయ ♦ సంబునఁ బాటిలు మేటిదయ్యవూ. 114

క. పుత్తడిమలబిలుకాఁడా, గిత్తహుమా నెక్కి పహొయలఁ ♦ గేరెదుకోఁడా
ముత్తిల్లుమిత్తిమూడా, బత్తిమిగులఁ గలుగువారి ♦ పాలిటివాఁడా. 115

తరళము. [illegible] తోమ్మునం దలఁ ♦ జెన్నిరొక్కెలపువ్వనున్
[illegible] లెబ్బులితోలుఁ గేలను ♦ ముద్దు [illegible]
నలంవయాదలపున్కపల్లెము ♦ నల్లగుత్తుకయుం గ్రైయి
న్వలపును నెవ్వలిబూది పూఁతయు ♦ వావిరిం గలవేలుపా. 116

గద్యము. ఇది శ్రీమదుమారమణకరుణాకటాక్ష నిరీక్షణసంలబ్ధసరసకవితాసామ్రాజ్య
ధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్త్రి
బుధజనవిధేయ తిమ్మయనామధేయ ప్రణీతం బైననీలాసుందరీపరిణయం
బనునచ్చతెనుఁగుఁ గబ్బంబునందు సర్వంబును
దృతీయాశ్వాసము



PRINTED AT THE ANANDA PRESS:—MADRAS.

# శుద్ధపత్రము.

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 22, | 25, | రతనంపుగోవ, | రతనంపుఁగ్రోవ. |
| 23, | 5, | ముత్తియపుగోవ, | ముత్తియపుఁగ్రోవ. |
| 26, | 14, | జవ్వాజివంకిణీ, | జవ్వాజిపక్కణీ. |